శ్రీ

శుద్ధాంధ్ర నిర్వచన

# సత్యావివాహము

గ్రంథకర్త:

అష్టావధాని,

జంగా హనుమయ్యచౌదరి



బెజవాడ:

ఆంధ్రగ్రంథాలయ ముద్రాశాల (లిమిటెడ్) యందు

క. కోదండరామయ్యగారిచే

ముద్రింపఁబడియె.

1925.



క్యాలికోబైండు రు 0-12-0] [రేపరుబైండు 0-8-0



గ్రంథకర్త:

జంగా హనుమయ్య చౌదరి.

# పీఠిక

మృదుమధురమగు మనయాంధ్రవాఙ్మయమునందుఁ గావ్యనియమములు కర్ణాట ద్రవిడ సంస్కృతాది భాషలనుండి యాదికవులు సేకరించి గ్రంథరచనమునకు దొరకొనిరని పరిశోధకులు వ్రాయుచున్నారు. నన్నయభట్టారకుఁడు మొదలు అల్లసాని పెద్దనవఱకుఁగల కవులందఱు సంస్కృతాంధ్రమిశ్రముగఁ గావ్యము రచించుచుఁ బ్రాగల్భ్యమునకుమాత్రము అందందు శుద్ధాంధ్ర పద్యములు చిత్రగర్భబంధకవిత్వములు వ్రాయుచు వచ్చిరి. శ్రీనాథునినాటనుండి తెలుఁగుకవిత సంస్కృతపదభూయిష్ఠమై చాలవఱకు నాంధ్రత్వమునే మఱచినది. ఆధునికకవులలోఁ బలువురు తాము వ్రాయునది యాంధ్రకావ్య మనుమాట మఱచికాఁబోలు కేవల సంస్కృతసమాసబంధురముగఁ బొత్తములు వ్రాసి యాదికవుల యాదర్శము దూరగులైరి.

ఈ యదనున మధురతరమగు నాంధ్రవాఙ్మయము ప్రబంధరచన యోగ్యము, మనోహరతరమని సాటి శుద్ధాంధ్రకావ్యరచనమునకు మార్గదర్శకుఁడైన పొన్నిగంటి తెలగన్న ప్రశంసాపాత్రుఁడు. ఆంధ్రభాషావ్యక్తిత్వము నీయనఘుఁడు కావ్యముఖమునఁ జాటించుటాది పలువురు కవులు శుద్ధాంధ్రకావ్యకల్పనాభిముఖు లగుట కవకాశము చిక్కినది. తెలగన్నకవి తెలుఁగుబాస నుద్ధరించుటకే భాషానామము దాల్చి యుండనోపు. శుద్ధాంధ్రభాషాస్వరూపనిరూపణమునకు లక్ష్యలక్షణములు చాలినన్ని లేనితరుణమునఁ దాను

శుద్ధాంధ్ర గ్రంథరచనము గావింప దొరకొనుట కష్టసాధ్య మని యాతఁడే క్రిందివిధముగ యయాతిచరిత్రమునఁ గృతి పతి యనినట్టుల వ్రాసికొని యున్నాఁడు.

'ఉ॥ అచ్చ తెనుంగు పద్యమొకటైనను గబ్బములోన నుండినన్
మెచ్చని యాడుచుందురటయెన్నుచుఁ బెద్దలుపొత్తమెల్ల ని
ట్టచ్చ తెలుంగునన్ నొడువనందులచందమెఱుంగువారు నీ
మెచ్చరొ యబ్బురంబనరొ మేలనరో కొనియాడరో నినున్'

శుద్ధాంధ్ర గ్రంథరచనమునకుఁ ద్రోవదీసి కావ్యరచన మునఁ గృతార్థులైన తెలగన్నకు ఏకవడఁ గూచిమంచి తిమ్మకవి కొత్తపోకడలతో నచ్చతెనుంగు కబ్బముల రెండిని మనో హరముగ వ్రాసెను అవల శుద్ధాంధ్రకవితలోఁ జిత్రరచనలు గూర్చి పరిగంటి నింగరాచార్యకవి సీతాకళ్యాణాది శుద్ధాం నిరోష్ఠ్యగ్రంథముల రచించి యందు నిరోష్ఠ్యవి వింశతి ప్రబంధనిర్మాణునని చెప్పుకొనెను. ఆధునికులలో శుద్ధాంధ్ర ధ్రగ్రంథరచనాధురీణులు కొలఁదిమంది కలరు వీరిలో సత్య విజయమురచించిన పార్థసారథికవి, శుద్ధాంధ్రనిర్వచన నిరోష్ఠ్య నలచరిత్రాదులు వ్రాసిన వీరేశలింగంపంతులువారు లోనగు కవివర్యులగ్రగణ్యులు.వీరందఱు శుద్ధాంధ్రసారస్వతమునకుఁ బ్రాణదానము గావించిన ధన్యులు.

పూర్వోక్త చరిత్రవిశిష్టమగు శుద్ధాంధ్రమున సత్యా వివాహమును నాలుగాశ్వాసముల నిర్వచనకావ్యముగ వ్రాసి యాంధ్రభారతీ చరణసన్నిధిని సమర్పించి ధన్యులైన కవి జంగా హనుమయ్య కవమ్మకులజుఁడు. ఈయన గురుసేవవలనను

స్వకృషివలనను సారస్వతాభినివేశము నార్జించి యీ నిర్వచన శుద్ధాంధ్రకావ్య మొనరించెను. ఇందలి ప్రధాన కథాంశము భాగవతమునందుండి తీసికొనఁబడి ప్రబంధానుకూలముగు కొలఁదిమార్పులు గావింపఁబడెను. మూలానుసారమగు జాంబవతీ పరిణయము కూడ నిందు చేర్పఁబడెను. పూర్వకవులవలెఁ బ్రకృత గ్రంథకర్తయు నీసత్యావివాహమునఁ గథాంశమునకంటె వర్ణనాంశమునకే ప్రాముఖ్య మొసంగెను. అందుచేఁ బురవర్ణనము, నాయికావర్ణనము, శ్రీకృష్ణసందర్శన వర్ణనము, వివాహవర్ణనము లోనగు వర్ణనాంశములు గ్రంథభాగము నాక్రమించుటచేఁ గథాకల్పనమునఁ గవికృషి చేయ నలవి కాదయ్యెను. అగుఁగాక! కవిత మృదుమధురముగను కూర్పు బింకముగలదిగను ధార శుద్ధి గలదిగ నుంటచే నీగ్రంథము చదువఁ జదువఁ జవులూరుచున్నది. కవి యాధునికుఁడని తెలుపకున్నచో నీకబ్బము తొల్లింటి కవి చెప్పెనని భాషాపరిశోధకుఁడేని విశ్వసింపఁదగినంత సారళ్యముగ నీ శుద్ధాంధ్రగ్రంథ మలరారుచున్నది. ప్రథమ ప్రయత్నమైనను గవి యిందు కృతకృత్యుఁడయ్యెనని మావిశ్వాసము. గ్రంథమునందలి కొలువువర్ణనము మనోహరముగ నున్నది. అందందు గల సామెతలు మనోజ్ఞములుగ నున్నవి. మూడవ యాశ్వాసముతో సత్రాజిత్తు సోదరునకై విలపించు భాగమునఁ గవి తనకుఁగల రచనాకౌశలము బూర్తిగఁ జూపియున్నాఁడు. తమ్ముని, శ్యమంతకమును గూర్చి విలపించు,

సీ॥ "తమ్ముఁడా! హా! శ్యమంతకమా"

అనుపద్యము రచనాప్రాగల్భ్యమున భాగవతము నందలి సత్యాసంగ్రామములోఁగల "రాకేందుబింబమై రవి బింబమై యొప్పు" అనుపద్యము పొందనగు గౌరవము బడయఁదగి యున్నది. సత్యాకృష్ణుల క్రీడావర్ణన మీనాటి నాగరకులకంటెఁ బ్రబంధపాఠకుల నానందపఱచును.

యవనపదములు కొన్ని దేశ్యములుగ నీకావ్యమునఁ బ్రయోగింపఁబడెను. ఇండియా, సబ్బున, మైచికిలీ యొనర్చుట లోనగు పదములుఁగూడ నిందుఁగలవు. కథాంశములు తెలుపువాఁడు సూతుఁడు, వినువారు మునులుగాన నీరెంటిని సూతునిచేఁ జెప్పించుట బాగుండునని మాతలంపు.

గ్రంథప్రచురణమున కవకాశము లేక చిరకాలము నుండి నిలువయుంచఁబడిన యీప్రబంధమును విని యానందించి భాషాభిమానముచే ముద్రించి ప్రకటింపఁదోడ్పడిన సారస్వతరసజ్ఞులు నుదారశీలురునగు మ. రా. రా. శ్రీ జవ్వాజి వీరయ్యగారియెడఁ బాఠకులు కృతజ్ఞులు కాకపోరు.

ఆంధ్రసోదరు లీ నూతనగ్రంథము నాదరించి యిందలి గుణముగ్రహించి కవిశ్రమ సార్థకమొనరించి యింక నిట్టిగ్రంథములను రచింపఁ గవిని ప్రోత్సహింతురని మావిశ్వాసము.

నందిగామ,
9—10—25.

ఇట్లు భాషాసేవకులు,
శేషాద్రిరమణకవులు, శతావధానులు.

# మనవి

అయ్యలారా! నావిన్నప మించుక యాలకింపుఁడు. ఈ యచ్చ తెలుఁగుకబ్బమును నేను సుమారు పదియేండ్లక్రిందట వ్రాసియుంటిని. అచ్చ తెలుఁగనఁగా దొలుతటి కబ్బములయందు వాడినట్టియు నిప్పుడు లోకులు వాడుచున్నట్టియుఁ జులకనై యందమైనబాస. ఇది కలగూరగంపవంటిది. ఇదియకాదు, జగమునంగల బాసలన్నియు నిట్టివే. ఈ తెలుఁగునందు సంస్కృతముకాని పలుకులన్నియు నుండును. పేరులు, బిరుదులు వచ్చునప్పుడు సంస్కృతముకూడ వాడబడును. తక్కిన సంస్కృతపుమాటలనుమాత్రి మేలపలుకకూడఁగనిన నవియన్నియు నించుకంత మార్పుఁజెంది తెలుఁగై తెలుఁగునందు గలిసియే యున్నవి. చాలమందికీతెలుఁగు చిన్నబాసయనియు దీనియం దేపొత్తములును వ్రాయుటకు వీలులేదనియుఁ దలంపు. అట్లు గాక దీనిని జాలపెద్దబాసగాఁజేసి దీనియం దన్నిరకములపొత్తములను పాటలు పద్దెములవగైరాలతో నింపుగాఁ గూర్పవచ్చునని తలంచి పొన్నిగంటి తెలగన మొదట నీక్రొత్తదారిం ద్రొక్కెను. తరువాత కూచిమంచి తిమ్మనమొదలగువారీదారి నడచిరి. ఈదారియం దేమిమంచికలదనిన తెలుఁగుకన్నియను సంస్కృతమును దేవేరికి నాడిగఁపుఁగత్తెనుగాఁ జేయకుండుటయుఁ దెలుగువారందరు సంస్కృతమును నేర్చియుండినఁగాని తెలుఁగుపొత్తములు తెలియవీలులేదను గాసిఁ దొలఁగించుటయును; అయితే తెలుఁగువారు సంస్కృతమునేర్చుటయే గాసియనుచున్నాఁడవుగదా! తెలుఁగులోనికి పరాయి బాసల

మాటలన్నియు జేర్చుకొనుట కొడంబడుచున్నారే, యవి యన్నియు నేర్చుటకేమియుఁ దిప్పలులేవా యందురేమో. పరాయిబాసల మాటలన్నియుఁ జేర్చుకొనుటకు మున్నటికైపరు లొప్పియుండలేదు. తెలుఁగువారికి మామూలుగాఁ దెలిసి యుండి తెలుఁగుమాదిరిగానే వాడుకొనుచున్న మాటలవరకే యని తెలియుఁడు. నేఁటివరకుఁ జాలమంది కైసరులు సంస్కృతపు నుడులనఁగుసయనెడి యినుపగొలుసునకు జివర నొకచిన్న తెలుఁగుపలుకనెడి యుచ్చునుపెట్టి యిది చేదత్రాడనఁ జొప్పిరి. ఈ తెలుఁగుబావిలోని నీటినిచేదుటకు గొలుసును పట్టి లాగగలిగినవాఁడు, నుచ్చునుతీయగలిగినవాఁడు గావలసి వచ్చినది. ఇనుపగొలుసునుమోసి లాగగల్గినవాఁ డుచ్చుతీయ లేఁడు. ఉచ్చుఁదీయ నెఱిఁగినవాఁ డినుపగొలుసును లాగఁజాలఁడు. చేదను తయారుచేయుటకుఁ గమ్మరిపనియుఁ గాపుపనియుఁ దెలిసినవాఁడు గావలయును. ఈచేదకు తెలగన కొబ్బరి, జనుప, గోఁగు మొదలగు నారలతో త్రాడు వేసి చూపించినాఁడు. ఇట్టిత్రాడు చేదకు మిగుల బాగుగానుండును. ఈలాగున పెద్దపెద్ద మోకులనువేసి తెలుఁగుతేరులను జులకనగా మనము లాగవచ్చును పరాయిపలుకులు మనము గైకొనిన మన తెలుఁగుచెడిపోయి తెలియకుండఁబోవునని కొంద రెంచెదరు. మున్నటి సంస్కృతపుగబ్బములందును, సంస్కృతముగలసిన తెలుఁగు పొత్తములందును, ప్రాఁబలుకులయందును, గ్రీకు, తురక, అరబ్బి, పారసీకుల మాటలెన్నియో చేరియున్నవి. మనకు పొంతనున్న ద్రవిడ, కర్నాటక, మహారాష్ట్ర, ఘూర్జర, ఓఢ్రి, హిందీమొదలగు బాసలు మనబాసయందు చేరియున్న

మాటఁ జెప్పనేర్పరయే లేదు. అట్టిమాటలన్నియు నిప్పుడు వినవింపై, కనసొంపై మనకుఁ జులకనగా దెలియుచుండుట లేదా! మొదట నీబాసయు నోరులమాటలు గైకొనక పెంపొందదు. ఒరులమాటలు విని కైకొననొల్లనివాడు మోటు వాడగుట నిక్కము. కావుననే తెలుగుబాసకును సంస్కృతపుఁ జేయూత యగత్యమని దానిసాయమును గోరిరి. తెలుఁగు బాసను పెంపుజేయఁ దలఁచిన వారట్టి సాయము నెట్టి యెక్కట్టుననో, యెట్టిమార్పుననో కైకొనవలసి యుండ, చాల మంది కైపరులు తెలుఁగును రూపుమాపి పనికత్తెను జేసి సంస్కృతమును పెండ్లికూఁతురిం గావించిరి. అన్ని బాసలవారును తమతమ బాసలను పెంచుకొనుచుండ మనవారు మనబాసను మఱచిపోయిరి. ఇప్పటివారిలో చక్కగాఁ జదివినవారు సైతము చాలనుడువులకు తెలుఁగుపలుకు లెఱుఁగరని గట్టిగాఁ జెప్పఁ గలను. మున్ను తెలగన వగైరాలు తెలుఁగుగన్నియను గారా బము జేయుచు దొరకిన సొమ్ములు దెచ్చిపెట్టి బొట్టుంగాటుక దీర్చి తెలుఁగుఁ బుట్టముఁ గట్టనిచ్చి మనకుఁ జూపించినారు. మనమిప్పుడైనను దానిని మన్నించి పంచదారను దినిపించి పాలను ద్రావించి పెంచవలెను. రైలు, టైము, మైలు, సబ్బు, రోజు, రకము, తరహా, తహాశీలు, వగైరా, తాలూకు, బాపతు మొదలగునవి మొదట పరాయిమాటలైనను నానా టికి మన తెల్గువారి కందరికి బాగుగాఁ దెలియుటచే పీపలుకు లిప్పుడిట్లే వాడుట కెంతయో తగియుండును వీనిని మఱి యొకరీతిని దెనుఁగునకుఁ గాని, సంస్కృతమునకుఁ గాని మార్చిన యెడల వంకరదారిని నడచినట్లుండును. కావునఁ దెలుఁగు

వారి కందఱికిఁ దెలిసిన పలుకులన్నియుఁ దెలుఁగనియే యెంచి మున్నటి పెద్దలు వారినాఁటి కెఱిగిన నుడువులను కబ్బములందు వాడియున్నారు. ఈబాట నెఱిఁగియుండియు నిప్పటివారు నాఁడు నూతుఁడు జడదారుల కిట్టి క్రొత్తమాటలతోఁ జెప్పుట కలుగునాయని యడుగుచున్నారు. తెలుఁగుబాస పుట్టకముందెన్నఁడో చలిగట్టు వద్దనున్న హిందీ, బెంగాలీ, తమిళులకు నూతుఁడీ తెలుఁగు పద్దెములతో జెప్పుట మాత్రము బొసఁగునా? పొసగదు. ఎచ్చోటనున్నవా రచ్చోట నప్పుడు వాడెడి బాసతోఁ గతలు, పద్దెములు, పాటలు నుడువుచుందురు. కాని వెనుక నాకతజరిగినతఱియందు వారుమాటలాడినబాస యేదియో తెలిసి చెప్పుటకు వీఁగునా? అట్లొకానొకడు నేర్చిచెప్పినను వినువారికిఁ దెలియునా? తెలియదు. కావున నప్పుడు వాడుకలోనున్న బాసతోఁ గైతజెప్పుట తగునని మున్నటివారు లాతిబాసలలోని పలుకులు నెల్లఱికిఁ దెలిసినవి కబ్బములందు వాడియుందురని నానమ్మికము.

నా యీ కబ్బమునందు నానేరమిచేఁ గల్గిన తప్పులును బొరపాట్లును పలుచోట్లఁ గల్గియుండవచ్చును. తెలిసినవారు వానిని నాకుఁ దెలిపినయెడల సంతసముతో నందుకొని రెండవ కూర్పునందు సవరించుకొనియెదను.

ఈపొత్తము నచ్చుగూర్చుతఱియందు నేను చిత్తుకాపీలు చూచుటఁ గలుగనందున నచ్చుతప్పులుఁ గొన్ని పడియున్నవి. అచ్చుఁగూర్చుటకిచ్చిన వ్రాతకాపి యొకపిల్లవాఁడు వ్రాసినదగుటచే బండితాలు, అరసున్నలు వ్రాసియుండలేదు.

ఇట్టి చిన్న చిన్న నెఱసులకై తెలిసినవారు నన్ను దూఱకుండు దురు గాకయని వేడుచున్నాఁడను.

నైజాంయిలాకా వరంగల్ జిల్లా మధిరతాలూకా, యిల్లందరను వీట న్విలసిల్లెడివారును, కమ్మవారును నగు మహారాజరాజశ్రీ జవ్వాజి వీరయ్యజమీందారుగారీపాత్రము నచ్చుగూర్పించుట కయ్యెడిసొమ్మంతయు నిచ్చి నాపైఁ గూర్మియుఁ దెలుఁగుగన్నియపై గౌరవమును జూపించి తిరమైన వాసియు వన్నెయుం గడించిరి. కావున వీరికిని, ఈపాత్రమునందలి పీఠికను వ్రాసిపంపిన శతావధానులగు శ్రీమాన్ శేషాద్రిరమణకవులకును కడుంగడుసంతసమున జోహారులం గావించుచున్నాఁడను.

వీరులపాడుగ్రామం,
నందిగామతాలూకా.
19.10-25.

ఇట్లు,
అష్టావధాని, జంగా హనుమయ్యచౌదరి.

# పండితాభిప్రాయములు

సుప్రసిద్ధశతావధానులు నుభయభాషాకోవిదులు నగు బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు కడియం నుండి యిట్లు వ్రాయుచున్నారు.

"మీపుస్తకము (సత్యావివాహము) చేరినది. అచ్చతెలుగు కవనమైనను, మృదుమధురపదభూయిష్ఠమై రసయుక్తమై నిర్దుష్టమై కడుంగడుం జక్కఁగానున్నది. మీ కింకను భగవంతుఁ డిట్టి చక్కనికబ్బములను రచించుపూనిక నభివృద్ధిపఱచి యాయురారోగ్యైశ్వర్యప్రదుఁడై యుఁరించుగాక!

కడియము,
21-9-25.

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి,
శతావధాని."

---

కావ్యతీర్థబిరుదాంకితులును, ఆంధ్రబ్రహ్మాండ పురాణాది గ్రంథకర్తలునగు బ్రహ్మశ్రీ జనమంచి శేషాద్రిశర్మగారు కడపనుండి యిట్లు వ్రాయుచున్నారు.

ఆర్యవర్యా!

"భవత్ప్రేషిత సత్యావివాహమును శుద్ధాంధ్రనిర్వచన ప్రబంధము ప్రీతిమీఱంగొని యందందుఁ బఠించితిని. పద్యములు పరమహృద్యములు. పాకము శుద్ధాంధ్రమగుట ద్రాక్షాపాకమునుమించి కదళీపాకమునఁ బడినది. శైలి సలక్షణముగ నలరారుచున్నది. కొన్నికొన్ని తావుల నంది తిమ్మన్న

గారి పారిజాతాపహరణపద్యములా యివి యను భ్రమను బుట్టింపక విడువవు. వర్ణనములు శ్రుతికటువులుగాక స్వభావమునుమించక సొగసుగ నున్నయవి. ద్వితీయాశ్వాసములోని "మగనేతపల్పి పొల్పగు" అను సీసము, దానివెంబడి నగు "సొంపుసింపెడి సంకు"అను సీసము చదువునపుడు దేహము పులకరించినది. ఇట్లే అన్ని తావుల నెత్తిచూపుట సరసముగాదు కాన వదలితి. పద్యకావ్యములన్నఁ దలకంటకించువను మహాత్ముల కేమోకాని యేమాత్రము భాషాసేవ చేసినవారికైనను మీగ్రంథము శిరసావహింపక విడువరాదని నొక్కి వక్కాణించెదను. ఇట్టి పరమోత్కృష్ట గ్రంథరత్నహారమును భాషాజననికిఁ గానిక పెట్టి ధన్యులైతిరి. "సమానానాముత్తమ శ్లోకోస్తు" అను శ్రుతివాక్యఫలము నొందుదురుగాక యని సత్యముగఁ గోరుచున్నాఁడను. ఎక్కువ సారస్యమును గ్రహించి మిక్కుటమగు చమత్కారముగ వ్రాయఁజాలని నేను మీగ్రంథరాజమునకొక్క నమస్కారముచేసి శిరసావహించి నాయాశయము విన్నవించుకొనుచున్నాఁడను. మీ కీ గ్రంథరత్నము దిగంతవిశ్రాంత సంతత సుయశంబు చేకూర్చి సరసజన శిరోధార్యులై యసమానవిఖ్యాతి నలరారుఁగాక యని నమ్ముచున్నవాఁడను.

కడప,
1—10—25.

ఇట్లు విన్నవించు మీవిధేయుఁడు,
జనమంచి శేషాద్రిశర్మ."

సుప్రసిద్ధ నిరుద్ధ భారతాది గ్రంథకర్తలగు బ్రహ్మశ్రీ మంగిపూడి వెంకటశర్మగారిటులు వ్రాయుచున్నారు.

"మహాశయా! తాము దయతో పంపిన సత్యావివాహము సంతోషముతో నందుకొని యచ్చటచ్చటఁ జదివితిని. అచ్చ తెలుఁగుపాత్రములు రచించుటయే కష్టము. నిర్వచనముగా రచించుట కష్టతరము. సత్యావివాహము శబ్దాలంకార యుక్తమయ్యును, శైలి మృదుమధురమై యలరారుచు నింత వరకుగల యచ్చతెలుఁగుగ్రంథము లన్నిటికన్న సులభ గ్రాహ్యమై యొప్పుచున్నది. తామింకను ననేక గ్రంథరత్నములచే నాంధ్రభాషా యోషామణి నలంకరించి యలరించునట్లు సర్వేశ్వరు డనుగ్రహించును గాకయని కోరుచున్నాను.

18—9—1925

ఇట్లు విన్నవించు,

మం. వెం. శర్మ."

---

విజయాంకసాహసాద్యనేక గ్రంథకర్తయును అష్టావధానియు నగు శ్రీ రాజా మంత్రిప్రెగడ భుజంగరావు బహద్దరు జమీందారు గారిట్లు వ్రాయుచున్నారు.

"అయ్యలారా! "సత్యావివాహ" మను నీశుద్ధాంధ్ర నిర్వచనంపు కబ్బంబు నాలుగుగ్రుక్కలును మొదటినుండి తుది వరకు నసడ్డసేయక చదివి సంతసిల్లితిని. అచ్చ తెలుఁ గని నంతన నది యెలుకలఁబొసయకా నెంచి చదువ విసివి విడుచు నబ్బెసము మనవాండ్రలోఁ బెక్కండ్రకుఁ గలదు. ఏలయన

మారుమూలలనున్న మాటలతోఁడను సొంతముగం గూర్చిన కూరుపుమాటల కలయికతోఁడను బొత్తంబు ఒల్లఁబడి యుండుటచే నెఱుకపడమి లాతివారి సాయంబు కావలసి యుండెడిది. దానంజేసియే దీనిం జేసిన కైసరుడు:

'క॥ తెనుగున జేసినకబ్బము
ఇనుప నగలటంచు నందు రీసున నిది యా
యినుమైన మేల్మియైనను
బెనుబత్తి నొసంగినాఁడఁ బెట్టుము తండ్రీ!'

అని నుడివియుండెను. ఇప్పొత్తం బట్టి గట్టిమాటలతో నిండక కమ్మచ్చునం దీసిన బంగరు తీవియంబోలె మొదటి పద్దెము మొదలు తుదిపద్దెము వఱకు నొక్కమాదిరి మాటలకూర్పుతో నొప్పుచున్నది. ఎందును నడక కుంటువడుచున్నదను పద్దెమే కానరాదయ్యె. ఏ సీసపద్దెముం గాంచిన నేదియో యొక సింగారమందు బొందుపడి యుండెను. వీనికన్నింటికిం గతయుఁ దగినదియై యున్నది. ఇం దచ్చటచ్చటఁ బసందు, షోకు, పేక, మున్నగుమాటలు కానవచ్చుచుండినను దఱికెందగిన చవినొసంగు మాటలుగానే నాకుఁ దోఁచుచున్నవి. ఇట్టి కబ్బంబులు పెక్కొనరించి వీరు మననాట నచ్చతెనుంగు బాస రెక్కొన సేయుదురుగాక యని మిక్కిలి కోరుచు వీరికిం గడలేని బిరుదుకీడ వేల్పుపెద్దం దద్దయు వేఁడుచున్నాఁడను.

ఏలూరు,
20—9—25.

ఇట్లు విధేయుఁడు,
రాజా. యం. భుజంగరావు.”

పిఠాపురమునుండి సుప్రసిద్ధకవియగు ఉమర్ ఆలీషా కవిగారిట్లు వ్రాయుచున్నారు..

"తే॥ గీ॥ జంగమానుమయ్య సత్య వి సత్యపెండ్లి
కథను రచియించి యాంధ్రలోకమునఁ దెల్గు
బాసకెంతయు వన్నెయువాసిఁ దెచ్చె
నిచ్చలు చదివి కోవిదుల్ మెచ్చునట్లు.

చం॥ సురుచిర భావసంపదలుసొంపులు నింపుదెలుంగుబాసకుఁ
మెఱుఁగులు దెచ్చువర్ణనలు మేలగుశైలి రసప్రపూర్ణమై
పరగు కథాచమత్కృతి ప్రభావము నచ్చునఁబోసినట్లు సుం
దరతరమై వెలార్చును సతంబును సత్యవివాహ కావ్యముఁ.

పిఠాపురము,
19—9—2౦.

ఇట్లు,
ఉమర్ ఆలీషా."

---

శ్రీ శ్రీ పిఠాపుర మహారాజావారి యాస్థాన విద్వత్కవులును, శతావధానులు నగు ఓలేటి వేంకటరామ శాస్త్రిగారిట్లు వ్రాయుచున్నారు.

"అయ్యా, మీరనిపిన కబ్బము (సత్యావివాహము) చేరినది. అందందు జదివిచూచితిని. అచ్చతెలుఁగుంగయితయందు మీరొనర్చిన యేర్పునకు మిగుల నచ్చితిని. పద్దెములు ముద్దుగనే యున్నవి. కాని మీరీకబ్బము కూర్చిన తెల్లయెడలఁ దొల్లింటి తెరువుల బట్టి యరిగియు నన్నిచోటుల నఱసున్నలను గొన్నితావుల బండిఱాలను విడిచివైచుటకు గతం బెఱుక పడదయ్యె.

ఓలేటి వేంకటరామశాస్త్రి."

---

అవధానకంఠీరవేత్యాది బిరుదాంకితులును శతావధానులు నగు బ్రహ్మశ్రీ ప్రతాప వేంకటేశ్వరకవిగా రిట్లువ్రాయుచున్నారు.

చం॥ జిలిబిలిపల్కులన్ సుకవిశేఖరులెవ్వని పూర్వమెన్ని ర
ట్టులె రసనాత్మమార్గతి గడుంగడు హృద్యముగాగ నప్పుడున్
చెలువున సత్యపెండిలి సుకవీశులెల్లను మెచ్చ వ్రాసి యాం
ధ్రులకునుపకారమున్ సలుపనోతె హాస్యమయప్రాజ్ఞసంప్రియా.

ఉ॥ కంపువుపాటగా గుకవితంతము నిత్యము పెక్కుపొత్తముల్
సొంపరి వోకపిరిన ఫలమున్ సమకూర్పనె యాంధ్రికిన్ సుకీ
వంపనకంబుకూర్పగా బడిన సత్యవివాహమె చాలు నాకయన్
గంపెడుగుల్లకాల్ గలుగుకన్నను రత్నమొకండు చాలదే.

తెనాలి, ఇట్లు విధేయుడు,
25-10-25. ప్రతాప వేంకటేశ్వరకవి.

---

ఉ॥ అచ్చపుదేనెసోన ననయంబును వీనులవిందు సేయుచున్
మెచ్చిన మా విపాఠకుల నెంతయు గబ్బములెల్లవారికిన్ పె
న్మెచ్చుల నొంగజాలియును మేటిగొనమ్ముల కెక్కయున్న మీ
యచ్చతెలుంగుకబ్బమున కచ్చెరువున్ మదికొసమెంచితిన్.

ఉ॥ అచ్చతెలుంగుబాసయనయన్ గడు గొడ్డిరియుండు బద్దముల్
మెచ్చిన కల్లగానగును, మూకుగ నింతటి పెద్దకబ్బమున్
వచ్చెదు మూడ్కి వ్రాయనగునా కడువిట్టతనమ్ము లేక, మా
లచ్చిమగండు పేర్మి దొరలన్ గయితిన్ డిరముండినచ్చుతన్.

గుడివాడ, ఇట్లు,
26-10-25. జంధ్యాల శివన్న శాస్త్రి.

శ్రీరస్తు.

 మ. రా. రా. శ్రీ జవ్వాజి వీరయ్యజమీందారు గారిం

గూర్చిన బహూకృతి.

# పంచరత్నములు

సీ॥ ప్రథితమై తగు నిజాం । రాష్ట్రమందుఁ దెలంగు
నిర్మలాంచితపూత । నీర వైర,
తత్సరిత్పశ్చిమ । తటమున రాజిల్లు
సిల్లూరు నాఁగ వే । రెసయునూరు
గణుతిగాంచె నందు । గాంభీర్యగుచౌర్య
కీర్తుల గనువారు । కమ్మవారు
వారలందుఁ జెలఁగు జ । వాజి నర్సయగారి
సుతుఁడు ప్రఖ్యాతధీ । యుతుఁడు హితుఁడు

గీ॥ వీరయాభిధధర్మసం । చారుఁడవరు
రంగయాభిఖ్య వేంకట । రామయాఖ్య
సోదరులు భీమశాస్త్రుల । ప్రాపకమునఁ
గొలుచు సత్యావధానుఁడు వీరి । నెలమిఁబ్రోచు.

శా॥ కంబై యాదిమభిక్షుపావనకటాకాం । కంబై సముద్యన్మృగాం
కంబై వీర సుధాపయోధిగత పం । కంబై హసత్పుండరీ
కంబై స్వచ్ఛజల ప్రపూరిత తటా । కంబై చలద్దేవలో
కంబై యొప్పు జవాజి వీరయ యశో । కంబీత్రిలోకంబులన్.

ఉ॥ ఒక్కటజర్మమొందిమరి యొక్కటమాంసమునొందియొక వే
త్తొక్కటనెమ్ములొందితగ నొక్కటఁ బ్రాణములొందిపుట్టితా
నొక్కటబాలరూప ఫలమొక్కటఁ గైకొనెఁబొత్తుబిడ్డదే
దిక్కనజోవనర్థియని తీసి భరించితి వీరయాహ్వయా!

చ॥ అడిగినయిచ్చునో మొగము నల్లనవాల్చునొకొంతయిచ్చిన
న్నిడుమల బెట్టునోయనుచు నెవ్వనిపేఁడఁగ బుద్ధిపోక నే
పడఁబడుచుండఁగావ్యముపు భాజనసీయకముద్రిణావ్యయం
బిడి యొదనేనటంచను ప రేంగితవేదిని నిన్ నుతించెదన్.

సీ॥ ఎందాక నిభమహా హీనకూర్మవరాహ
వాహాస్త్రయుద్ధాద్రి వరలుచుండు
నెందాక నీవనాయ కేందుతారాయుక్త
నభ్రమండలముఁ జెన్నారుచుండు
నెందాక కైలాసాద్రి హిమరుక్కిరుటుండు
గిరిజాసమేతుఁడై పరగుచుండు
నెందాకఁ గమలాక్షుఁ డిందిరాంగనతో సు
ధాబ్ధివీచికల నుయ్యాల లూగు

గీ॥ నెంతమనందాకఁ గవితయన్ దలిరుఁబోణి
నీయశోగానమును జేయ నెగడుమయ్య
కూర్మకులచంద్ర దాతృతా గుణబలీంద్ర
సాంద్రగుణధుర్య జవ్వాడి వీరయార్య!

ఇట్లు విధేయుడు,

అష్టావధాని, జంగా హనుమయ్యచౌదరి,

వీరులపాడు.

గుట్టరాచూలేసి కోర్కులునిండార
గట్టింతయుండ్రిముల్ కడగిచేయు
తబిసితేడెవసితో దపలిపల్కుచుబోవ
నన్నిపాత్రములనింపాక వ్రాసె

కందునకు దోసబుట్టి చెన్నందుజెట్టి
ఘతఘలసుబాదు సలుకిపై సెక్కుజోదు
పుస్తములపంట గానముల బూనుదంట
యెన్న దళ్వైనకయ్య నే నెంతు మదిని.

గీ॥ మొదల రామసికత బొత్రముగనానర్చి
కైసరులకంకరికి దారి గనుపరచిన
కలుగుకాన్పునిరాబారి గట్టితనము
సగదలంచెద గడుబత్తి గుదురుపరచి.

ఉ॥ మున్ను తెలుంగుకబ్బములు బొల్పుగజేసిపొగడ్తగన్న యా
నన్నయభట్టు దిక్కనను నాచనసోముని రంగనాధు బో
తన్నను రామభూషణుని నచ్చు తెలుంగునుగూర్చినట్టి తె
ల్గన్నను దివ్మ్రనల్ వలతు నందము కైతను జిందువందగన్.

సీ॥ రెండుబాసల కైత గొండాడజెప్పిన
తిరుపతి వేంకటేశ్వరుల మెచ్చి
చులకినానోర్బిందారి బలు పొత్తములుజేయు
వీరేశలింగము సారెదలచి
తెనుగురామాయణంబును నేర్పుమైగూర్చు
వావిలికొలను సుబ్రాప్రనెంచి

బ్రహ్మాండమును తెనుంగుబాస గావించిన
జనమంచి శేషాద్రి శర్మకెరగి

శబ్దరత్నాకరము జేయు జాణగొల్చి
త్రిపురనేని రామస్వామి దిట్టబొగడి
మరియు తక్కినయట్టి కైసరుల వేడు
వాడ బాసకు మేల్సేయువారలగుట.

గీ॥ చిలువసామికైన పలవంపుగలిగించు
పలుకులందు దేశి జిలుకుచుండు
వాని నాజ్ఞ సడలి వైకుంఠశాస్త్రిని
నామదింగుదుస్తు ననుపుమీర.

సీ॥ ఎటకేనిబోయి నేనించుక సేపున్న
నరయు జుట్టాలయిండ్లన్ని దిరిగి
చిన్నతనంబుచే జెడువెచ్చమొనరింప
వలదని చెప్పు నవ్వారిగాగ
గాళలతో గూడుకొని దోసములొనర్ప
వినజెప్పి జెప్పించె పసిగిగొణిగ
పెరుగు నెయ్యింబప్పు వరిబువ్వతో బెంచె
బిట్టుసన్నపు సేలు గట్టనిచ్చె

నిట్టమాతల్లి లక్ష్మమ్మ నితవుమీరు
దట్టపుగొనంబుగల్గు మాతండ్రియైన
శేషయను గొల్చి బత్తితో జెలగి మొక్కు-
లిడుదు వారల యుప్పలో బడకయుండ.

క॥ అనివేల్పుల వేల్పుల కీ
డనపగుహారంను గొల్ప యల వంగడమున్
వినుతింతు గూర్మితోడన్
వినుడని వినువారి మొదల వేడ్కాని వేడ్కన్.

కవివంశానుక్రమణిక.

గీ॥ ఇల వెలుగునీపు బెజవాడ గలదు దాని
కెంచ బడమరగా నిర్వదేనుమైళ్ల
నుండు వీరులపాలన నొప్పుపల్లె
యందు గల్గిన కమ్మల నరసిచూడ.

సీ॥ తెంపును బెంపు రాణింప జాగము గల్గి
యెమ్మెనొప్పెడువారు కమ్మవారు
క్రిమ్మి హిమ్మనుచు బింకమ్ము జూపెడివారి
గుమ్మ గల్గినవారు కమ్మవారు
బూతులాడుట సత్తిజాతకల్ సేయుట
కలనెరుంగనివారు కమ్మవారు
వగువలు మగవాండ్రు తగుపాటుచదివి చ
క్కగబల్కగలవారు కమ్మవారు
కంతుని బెడంగుగలవారు కమ్మవారు
కచ్చెరిని జంకనివారు కమ్మవారు
కబ్బములు చెప్పగలవారు కమ్మవారు
కడిది నాజూకు గలవారు కమ్మవారు.

క॥ రంగుగ నా పెన్నమ్మల
వంగడమున మిగుల వాసి వన్నె జెలంగన్

జంగావా రలరుదు రు
ప్పొంగి జగంబెల్ల యశము పొరలుచునుండన్.

క॥ ఆగోకులమునందు నిల్వఁగ
రాగోకులమునఁబుట్టినట్టి యా మునిబోలెన్
దేకుణగర్గనవాడై
శ్రీకృష్ణయ జనముఁద్రికేయుసి పొగడన్.

సీ॥ చనుబాలుపంగు నాతిని గూల్చినట్టింపు
గొల్లచెల్వ గూడికొన్న కంపు
బలుజరాసంధుదాడులకు బారిచాప్పు
చెలులచీరలను దొంగిలినతప్పు
కదుపుల వనవిలోగలయగాచిన నెవ్వ
మేనత్తతోగూడి మెలగునవ్వ
యొరులకుండలలోని పెరుగుదాగినకట్టు
చలిదిబువ్వలు దినవలయునట్టు

వీడుకొనియొను కృష్ణుండు వేడ్కమీర
నేఁకమెపగెడు గొనములకెల్లసెల్ల
అడదులకుపెట్టు యశములకాటపట్టు
నైనకృష్ణయ్య నా బువియందుబుట్టి.

క॥ మెప్పుగ నాతడు కాంచెను
గొప్పగొనంబులుగలట్టి కొడుకున్ బుదుల
ప్పప్పాయెంతటి వాడను
నప్పయబున్నె తులలెట్ట నను వగుదిట్టన్.

క॥ చెలుఁగు గొడుకు లతనికిఁ
జెలగిరి సుబ్బయ్య మరియు శేషయ నాగ
య్యలు నాఁగ మువ్వురు తొలిప
ల్కులు మూఁడును మన్ననల్వకుంగల్గినటుల్.

క॥ వడముడినలై సత్త్వనయును
విడిముడియును గల్గి యాఁముపెదజల్లితగఁ
పుడుకుఁ బ్రహ్మానన చాగం
బడరఁ సుబ్బయ్య జగము శౌడాయనగఁ.

సీ॥ అందు నాగయ్యగారంచె సంగయ్య వెంక
టప్పయలు నాఁగ దగువారినొప్పు మిగుల
సిరి బత్తి పెరిమెఁకు నిమ్మెలనగ
నుల్లసిలిమాసికములు నాకెల్లువారి.

మ॥ అల శేషయ్యదనర్చెబున్నెముల పోఁ్రివైనెమ్మదిఁ గల్గియెం
దలుకఁ మాట యెఱుంగకే కలిమికిం పౌచాగముఁ దెంపుద
న్నలమన్ మారటలచ్చినా దనరుఁ తిమ్మమ్మఁ గడుం బేర్మి బెం
డిలికై జానకిఁ తిమ్మనర్సమల నెంతే చాయమాంబఁ గనెఁ.

క॥ అమ్మవ్వారు నెలతలకుఁ
దమ్ముఁడ హానుమయ్య యనగ దనరినవాడఁ
గమ్మని తెలుగున బలు క
బ్బమ్ములు నుడివిలెని లేత పరువములోనఁ.

సీ॥ తెలగనయు దిమ్మనయు నచ్చ తెలుగుగూర్చి
గొప్పతనమొందిరని నేను గూర్చుటరయ

కడలి దూకిన యనుమని గాంచి యొక్క
కోతియును దూకి పడినట్టి రీతిగాదె.

కం॥ చెలువుడు కృష్ణుడు తలప౯
చెలియా కన్గొనగ సత్య జిలిబిలి తెలుగుం
బలుకులు కూర్చెదునవి బ
త్తుంకు౯ జదువులకు నెలమిదోపదె యుందు౯.

గీ॥ సత్యపెండ్లి యిపుడు చక్కనచ్చ తెనుంగు
బాసతోడ నేను బల్కువాడ
గాన దీని మెత్తిగాంచంగ సుకవిగోరి
యింపుమీర వినుతు సెవని కినిన.

కం॥ అనదల గాచెడి వానికి
మొనగానికి గొల్లబోంట్ల ముద్దుల మురిపిం
చినవానికి జగములయం
దెన యెవ్వడులేని వాని కీడు పలికె౯.

కం॥ పంటయయి సల్వగుడ్డుప
నంటుల దన పొట్టయందునన్ జేర్చిన యా
తుంటవిలుతుతండ్రికి గడ
కంటె౯ గనికరము గురియు కరివేల్పునకు౯.

కం॥ మఱ్ఱాకుమీదబండిన
కుఱ్ఱనికి౯ వేల్పులెల్లగొలువందగు నా
కఱ్ఱిచెలికాని కొజ్జకు ,
గుఱ్ఱలబ్రతికించి యిచ్చుగొనముల గనికి౯.

క. పాలకడలి బాముపయిఁ
జాలగ నిదురించునట్టి జగజెట్టికి మిన్
జాలడుగు దమ్మిఁ బుట్టిన
పోలుపగారాని పున్నెపుం బ్రోవునకుఁ

క॥ పక్కులరాయని దమితో
నెక్కసకేరునకు లచ్చి యిల్లాలుగ బెం
పెక్కిన గేస్తున కుదుటున్
రక్కసి కూటువుల జెండు రారాజనకున్.

కథాప్రారంభము.

సీ॥ కాస్కగా నే నానత్ప్రాడి కతకు మొదల
దెట్టుఁసిన నిరాబారదిట్టలంద
రాక్కసోగూడి కనకానిచక్కజూచి
హరిమ ఒత్రియు వవ్రలు ముక్కిరిగొనంగ.

క॥ ఇట్టని సత్య నెటజే
పట్టైను వెన్నుందు దానివా రెవరు కొలం
బెట్టిది పోరెయ్యదితో
గట్టిగ పూకెరుగ జెప్పు కతవరుస మెయిఁ.

సీ॥ వింతయైనయట్టి వెన్నునికతలన్ని
వినుగురాదుసూవె విన్నకొలది
కప్పురంపుబెట్టె విప్పినరీతిగా
మెప్పులుప్పతిల్లు మప్పునప్పు.

సీ॥ అనిన నతడు పరాశరుం డనెడు తబిసి
కొడుకుపజ్జల నెవలోన గుదురుపఱచి

వెన్నుని దలంచి ముక్కంటిఁ గన్ని వేడి
వెలుగునకు మ్రొక్కి యిట్లని పలుకదొడఁగ.

చ॥ పుడమి సెలంతకున్ దొకను బొల్పగు ముత్తెపుజేరులోన నే
పడరెడు మేరువో యనగ నారయ ముత్తిడుపొళ్ళయందు జే
ర్వ్యజసియు నాకసంబలము పైడి హొంరంగుదురంగలించు క
ట్టడములచేత నింపెసగుటన్ దగు ద్వారకజెప్ప నెంతయున్

సీ॥ పూవులా ముత్యాల కొప్పులా రతనాల
పొప్పులా యేవాడలా ల్పెరంగు
తేరులా కెలిపూవు బారులా పెనురాచ
దారులా కడు పేరు సొరు నెరపు
జెట్టులా బంగారు కొట్టులా మగరాల
చట్టులా పట్టు లే దెట్టుగన్న
జింకలా చిల్క గోర్వంకలా పన్నిటి
ఒంకలా యేవంక జెలువు సూపు

తేటులా ముద్దుకోయిలపాటలా చొ
కాటమైవెల్గు పూవులతోటలందు
కోటలా పేటలా కడువాటమాట
వీటిగోటన్న మిన్న యెన్నిటికన్న.

సీ॥ కోటచుట్టు నగడ్త లోటుపాటును లేక
పాతాళపాల మున్నీటిదెగడి
అంది చందురుని కందాదజేయగ బోంట్ల
కొందు పీలగు మేడ లిందమొక్క

నెన్న మొన్నటిచిన్న గున్న యేనుఁగువెన్ను
దన్ను మిన్నేటి పొందమ్ముఁ బబ్బు
తలపుతో నుదుటుఁ జంకెలతోడ వలికరు
వలితో జఁ ముసల్పు వాగువములు

తీవలో ముత్తైకో్రవలో తియ్యగున్న
మావులోతమ్మి బావుఁల తీవ్రు లేమొ
నా వెలుగుచున్న యాటల నాతిమిన్న
గములు పాలుపందు నందు సింగార మూర.

మ॥ తొలిపల్కుల్ నలువాందగాఁజదివి తోడ్తోఁ దెల్గుతోనంతయుఁ
బొలుపొనర్చరిగింతు రప్పుడమివేల్పుల్ వారలఁ జెప్పుచో
నలునఁ వేలుపుటొజ్జబెంజలువ నెన్నంబోలునే సాటిగా
దఁ పంగా ముదివాండ్రు పల్కుగమిలో దార్కా రుగాకుండ్రురే

క॥ మెచ్చురరాచకోఁ ఁబును
వ్రిచ్చిన గొడ్డంటిజోదు వడి మీరెడు నా
చిచ్చరకంటిని నైనను
దచ్చనలాడెదరు పుడిమిదాలుపు లచటఁ.

ఉ॥ అక్కటనేస్తకాడు జగవంతటబిచ్చము నెత్తుచుండగా
రొక్కపుతేడు వద్దనడు గోవెలదింబలె నెంతగూర్చినన్
గక్కసమైనయాబ్రతుకుకాల్పనొకోయసియాసడింత్రుపెం
పెక్కన జేరసారములు సీగియు సొమ్ముఁనుగల్గుకోమటుల్.
గీ. అడుగుపుట్టువు లచట జెన్నారుచుండ్రు
గింజయును డబ్బు తమచేతిక్రింద చాల్పు

పాతరఁబసిండి నుండఁగా గీతగాంధ్రి
మన్ని చుట్టాల కీర్తుల కనిపి తనిపి.

సీ|| ఆరెండునవచెంగ్లకీ రెంటికిని జేర
మేమితేడాయేమి యిమ్మెలాడి
యీ రెంటిపై వ్రేయు మా రెండు తమ్ముల
బట్టిన గండుకావలయునెవ్వ
నాకంతజెప్పెడినో కాని వహ్వారే
ముద్దులూరెడుసుమీ పువ్వుఁబోణి
యెంతలాడఁగనేల పుంతజొచ్చినవెన్క
నెదవగుల్కనువాసి నదిమియుడుగు

గీ|| వనుచు నీరీతిపూఁటమ్ము నన్నికడల
నెలతుకలతోడ నవ్వుచు సిందుఁబవ్వ
నంపు సెరఁజాణలాడు చెల్వంపుబల్కు
లింపులనునింప వినువారి కెవ్వఁడందు.

చ|| వెలవెలబారునట్టితఱి వెల్లికఱిం ఁగగు పువ్వుఁదోఁటలఁ
మెలఁగినపిల్లగాలి యటమేసినతావులనెల్ల నీటి క్రొం
దళుకు పసిండిమేడల యడాయదకై నిదురించునట్టి రా
చెలియలమోములందునిచిచెచ్చెరమేల్కొనఁజేయునచ్చటఁ

చ|| చదివినవారియిండ్లను వసారల గట్టిన పంజరంబులఁ
బొదలెడు పెంపుడుంజిలుక బోదలుజెప్పెడి కైతలోచవుల్
మదిదనియింపవేరికి బలా తొలిపల్కులమాజ్జ లెట్టులఁ
జదువనెరింగెనో కయితజాలెటు లబ్బెసుమయ్యనోకదా.

క॥ అపీటికిగాపై తో
ట్టో వేల్పుంజాల్పునల్ప దోడ్పడుపాపై
పాపేల్పుంగవి రాపై
యావెన్నుంపొప్పు బత్తి కందెడుతోపై.

సీ॥ ఒకవంక బలుడు సాత్యకి బరామరిసింప
నొకకేవ గదసాంబులొదిగియుండ
నొకచాయ దనచుట్టలుబ్బుమీరగగొల్వ
నొకతట్టువెలవెలందుకలు బాడ
నొకదెస వైసరు లూని కబ్బముజెప్ప
నొకజాడ పెనుప్రోడ లుబ్బియాడ
నొకప్రక్క జెట్టీలు వాలునరు దెబ్బలుజూప
నొకట మంతురులేమొ యుగ్గడింప
నెల్లరికి నింపొసంగుచు నితనికంటె
గొలువనగువాడు పెరవాడు గలుగడెందు
ననుచు గొండాడ నాకల్మియన్ను గూడి
జగము గాపాడుచుండు నాసొగసుకాడు.

సీ॥ కెలకరిగాడు వగ్గలజేయువారల
కురక కలవ్ప దీర నొసగుగాని
పిత్రికితనము లేదు బిరుదునక్కలిజెట్ల
విఱిచి నేలకుబట్టి చఱచుగాని
మొఱకుతురకగాడు విఱివియాచులుకుతో
నెరపల్కలెత్తరిజరుపుగాని
తొలగినవారల మఱచిపోవడు పరా
మరికచే మురువు గన్పరచు గాని

మఱియుఁ జేయు బదార్వేలగరిత లున్న
యిరవులం దవమరలేక నరుత బెరిమ
నరుమగాని మెరసెడి కనికరముతోడ
గానములకునెల్ల నెల్లయై తనరు నతఁడు.

క॥ జగములనన్నిటి నేలెడి
మగవాఁ డక్కటి గాఁచ మనియెడివారిన్
వగవున్ నెవ్వరు రత్నయు
తగులాటము లోటుపాటు దగులునె యెందున్.

క॥ అచ్చట సత్రాజిత్తను
ప్రాచ్యము ప్రాయింతలేసి పుస్తెపునసి పే
రెచ్చగ గాపురముండున్
మచ్చింతయులేక ప్రాచమరియాంచ లోన్.

చ॥ పెరిమను జన్మాంబునన పెంపిలిరైన నెంచెయం దతం
డరుదుగగాంచె కూతునురయాంరెయటంచునారులెకరంబున
గ్బురపడి చూచుచక్కదనము న్గానము న్గానినెందుచున్
సరిగనరానిదాని బుద్ధి సత్యయనన్ జెలువొందు పిత్తరిన్.

చ॥ తిరమగు కొమ్మెమ్మ్రురుంగునడిదేరవమాటలు నేర్పుపల్కు బం
గరుననుకీలుబొమ్మ యొకికంబగు మేన్న ఫుప్రదీవ యె
త్తరి పసవగ్గిపోని వెలిదామరపువ్వుపెంచు సానపై
నారసినమానికంబు చెలియొప్పు నెవని విప్పిచెప్పుడున్.

క॥ అమ్మగువ తండ్రియెప్పుడు
నిమ్ముగ కదనునకువచ్చు నెల్లరకున్ బో

చ॥ కావున తమ్మి కొమ్మ చెలికాని గూర్చి కొల్చి తక్కువై
పోవని మేటిసొమ్ము గని పొందెదగాక యటంచు నెంచి యా
లావరిచానకున్ మురువులన్ వురిపించెదు ముద్దుబిడ్డకున్
దీవనలిచ్చి యిల్లకలె తెంపును పెంపు వలంపు నింపగన్.

గీ॥ కదలి వసివసి గండుతుమ్మెదలు పొదలి
రొదలు సేసెడి చలువపూపొదలు గలిగి
మదికి నింపొనరించు కమ్మనగు తావి
రా నిరాబాటలుచెడి కోనలోన.

సీ॥ మువ్వన్నె మేకముల ముత్తైదువలపిండు
పసుల దూడలకు ప్రాపగుచుండ
జవ్వాదిపిల్లుల పున్నాబోడులు కూర్మి
నెలుకకూనలతో నెలమినాడ
మెకపు రేడుల పిల్ల లేకపక్కములతోడ
జింకబోతలగూడి చెలిమిచేయ
తోడేళ్ళగుంపు సంతోసంబు గనికరం
బెనయంగ మేకల ననగిపెనగ

పులుగు రేడులు పాములు గలసి మెలసి
తద్దయును గారవంబున దనరుచుండు
తపసియిరువాకదాని సత్రాజితుండు
గాంచి యిది మంచిచోటని యెంచె నెడద.

చ॥ వెస నటనిల్చి పూనిక సరవింగన నొక్కట గొల్చుచుండె నా
కసమున వెల్గుమానికము గార్కొను చీకటిపీల్పు మ్రొక్కినన్

దాసరులువాపువేల్పు గడిదొంగలుదొత్తులుదిట్టుచుండ బల్
పసపసగారుపొట్ట [illegible] పిల్లలదాపుడు పెట్టె దిట్టయై.

చ॥ విసుడు చకోరగోలంపువుల వేసవిలోపల నగ్నివానయం
దుర చెనుగట్టునెత్తముల దూలక తెంపు జెలంగ హాజ్జలన్
వినుకరినిర్గ్రసత్తి బుసముగ గనియించి కరంబు బత్తితో
వినువిసుగన్ మెసంగుచును వేయువెలుంగు సామి కిట్లనున్

సీ॥ తమ్మిపూఁదోఁటీయ నిద్రామెరుంగుమొగంబు
విప్పించి లేనవ్వుగుప్పజేయ
గాఢచీకటివాలె గాటమౌ దోసంపు
వెల్లిసల్లప్పుడు విరియజేయ
చందురుతో గమి సెంది రేల్మిరిసెడి
తొగకన్నెసిరియల్ల దొలగజేయ
పండెరిందురూప్పులై ఱెడిరించు జగముల
పేర్మిడియానటుల్ వేర్చివేయ

మువ్వురు సాముల తేజులు బూని మూజ్జ
గముల మొగ్గలు గని మేలుగదుర జేయ
జన్నపుఁబనులుంగుగముల కెచ్చరిక జేయ
నోఁను మొండ్లను దలప విన్మానికంబు.

సీ॥ ఇఁటబుట్టువులకుండు చలిబెల్ల నెవ్వాడు
యెవ్వాడు పగలు గావించువాడు
గడుసుతొత్తుల విటకాండ్రమాన్పు నెవాడు
యెవ్వాడు దొంగల నేచువాడు

వేయిచేతులుగల్గి వెల్గుచుండు దేవుడు
నెవ్వాడు బలుకోర్కె లిచ్చువాడు
ముక్కంటివలపలిచక్కి నున్నవాడు
యెవ్వాడుసోకుల నేర్పువాడు

పాడుగుం బాముచే బట్టుబడెడువాడు
సరయ నేలపల్కులకు బెట్టి యైనవాడు
సుకము లందరి కీయగా జూచువాడు
ఎవ్వ డెవ్వాడు నాకోర్కె లిచ్చుగాక.

గీ॥ పగలుగాపించువాడు సోకగవిసూడు
దాసగు చీకటివేగాడు దొడ్డరేడు
నన్ను మన్నించు కోర్కెలన్ని నించు
ననుచు పలువుగాను వేడుకొనియంత.

గీ॥ తమ్మిచెలిపంగడీడు సతాత్రిజనునకు
కనికరమున శిప ంశకంబనెడు గొప్ప
మాసికము సంతవెలయనరాని దాని
దీసికొని వచ్చి చూపి యీతీగుపలికె.

గీ॥ ద్వారక డియ్యది జేజేలవారకునైన
కడలియల్లునికైన ముక్కంటికైన
గట్లనిం చిల్వ రాతలకట్లయందు
బుట్టదికి యున్న దెవ్వయుపట్టులేదు.

సీ॥ ఇదియున్నవారల కిచ్చుబంగారంపు
నాడెముల్ రోజుకు నాల్గువుట్లు

ఇదియున్న వారల కిచ్చు సుకంబుల
వ్వారిగా వారల వారలకును
ఇదియున్న వారల కిచ్చు యసంబుల
పండు విన్నను చుక్క లుండువరకు
ఇవియున్న వారల కిచ్చును బిడ్డల
మనుమల నిక జాలు ననెడువరకు

పొసగ దల దాల్చి యోలగంబునకు జనిన
మంచిపెడుగుల నేరి చూపించి తగిన
దారినడిపించు దొసగు లెంతయు నడంచు
దీసి కెనగాదు వేల్పురామానికంబు.

కి॥ ఇది తలదాల్చిన నాతడు
గడుముల జీకటులగుంపు గార్కొను వానిన్
బడితలలవాని బలగము
పదితేరులవానిపట్టి పడగొట్టినటుల్.

సీ॥ ఒకటవాకిలియంచు నొప్పైనగోడ కెం
తయు మోము నొవ్వగా దాకుచుండు
నొకవంక పెద్దసేటి కొలంకువని యుంచి
బట్టపై జిక్క కొల్పెట్టు చుండు
నొకచోట గద్దెయం చొగి గూరుచుండ సం
బరముతో జని క్రిందబడుచునుండు
నొకచెంత వెలజంతలుండిరంచు కవుంగి
లించి సిగ్గున దలవంచుచుండు

శ్రీ శమంతకమాణిక్యం బెడసి యింట
నుండునో వానియింట యేపొందు ప్రోడ
లైన బదునరులైన రేండ్లైన గాని
దీని గొనియాడ జిహ్వల జేని తరమె.

క॥ అని పల్కుచు వినుగతేనము
కనికరమున రతనమీయగా గైకొని యా
య్యన మొక్కె సంతసంబుఁ
బనుపడ దనయిల్లుజేర బయనంబాయెఁ.

క॥ ఇచ్చటికత యిట్లుండగ
నచ్చోటఁ సఖ్య వెన్నునంవలి గొనముల్
మెచ్చింపగు నంపాంబును
నెచ్చలిగమి సెప్పగా విని యా దగులూనెఁ

చ॥ తగులము నాడునాటికి సెదఁ జదురల్ బొనరింప నెంతయున్
బెగడి విరాకు జెందు చెలిబిందము గాంచు నాకోయటంచు లో
దగి లెడు సిగ్గుచే బయికి దా గనసీయక దాచుచుండు న
మ్ముగుదకు కంతుశాయిడియు మోపగ సిగ్గుసమంబులత్తరిఁ

ఉ॥ ఒంటరి గూరుచుండి మరుడుత్తలపెట్ట గలంత బారి వా
ల్గంటి వలంచు నిట్టు మరుకాకల కోరువజాల చుట్టు వా
ల్దంట కరంబు నన్ను తనదాపున జేరిచి బుజ్జగించుచుఁ
జుంటియబోలు మోవి చవిజూడగనిచ్చివదాక నెంతయుఁ

సీ॥ అదటుతో జని వెన్ను నదిరించి యెదయందు
సుదుటుగుబ్బలు బిగ్గనదుము టెపుడొ

సింగారముంగారు చెంగావి నునుమోవి
పానకంబూని నే నాను టెపుడొ
చికిలద్దముల నేలు చెలువుని చెక్కిళ్ళ
చెలువుమై ముద్దాడ గలుగు టెపుడొ
తేలుకారుమబ్బు సొంపులు గుల్కు మరునయ్య
నిండుకౌగిటిలోన నుండు టెపుడొ

కొల్చువారల కోర్కెల గూర్చుగిడ్డి
వేలుపున్వాకబుట్టిన మేలితావు
లైనకరివేల్పు పాజ్జలబూని కడిగి
తనరు సీటిసి నాగల దాల్చు టెపుడొ.

ఉ॥ కన్నుల కర్వుదీర దనుకంబున నాతని నవ్వుమోము నే
నెన్నడు జూతు వీనులకు నింపులు నింపెడు వానిపల్కు లే
నెన్నడు విందు వేడ్క లిగుఱించగ గూర్మి గవుంగిలించి న
న్నెన్నడు దన్పు గంతు నికనెన్నడు బంటుగ నేలుకొందునో

సీ॥ కరివేల్పు నొసలిచందురు తేటగాంచక
తగులు పెంకికటి తలగుటెట్లు
బలుకక్కసులగొంగపలుకువానలు లేక
సి విరాలపుటగ్గి బోవుటెట్లు
సరిలేని దిట్టవాతెరతేనె యనుమందు
జెందక మైకాక డిందుటెట్లు
మరునయ్య కేలుదామరతూండ్లు లేకున్న
బట్టి కోర్కులమోపు గట్టుటెట్లు
జెలగి కంతుండు బరవు పూదిలుకు గముల

నడ్డగించగదేయని యచ్చెలువ్రసి
పాలనెఱిగించగా నొంక్ష బెంచుటెట్లు
పంచకుండిన నామేను బట్టుటెట్లు.

ఉ॥ ఆతసివాతెరం గడిసి యల్లన నావగ బిల్లి గోపి ము
న్నేతరి నేమిఁ జెప్పినా బలీ సెరి చెక్కులపై జెలంగగా
జేతుల నెన్ని పున్నెములు జేసెనొకో సొలి గొంపగోగువూ
వ్రేతలు నేమినో పిరాకా వెన్నునితోఁ గనుగూడియాడగ॥

ఉ॥ ఇంపును సొంపునుం గలిగి యెమ్మెదనర్చెడి వన్నెకానికి
రంపెయాం జెలంగు నాకతాగనుగూరిచి యంచచందముల్
బెంపునుగల్గు కన్నియకు బిగ్గరనంటెడు జెంకెనొక్కని॥
గొంపలుగూల్చుగా నలువ కూళతనంబుల కెల్ల నెల్లయి.

ఉ॥ తావులు కుందనంబునకు దాపురమైనటు లించునందు బల
పూవులుబండ్లు గల్గినటు బొల్పగు చక్కదనంబు రంగును॥
గోవెలకబ్బినట్లు కులుకుంబలుకు ల్మరువైన యంచకున్
దావలమైన యట్లు నను దప్పక వెన్నుడు గారవించిన॥

సీ॥ బంగారు తగటుదుప్పటివాని నావాని
గావించగదవమ్మ గంగనమ్మ
బలునెమ్మికుంచె యాడలవాని నావాని
గావించగదవమ్మ రావలమ్మ
సుడివాలు సంకుదాల్చెడువాని నావాని
గావించగదవమ్మ గంటలమ్మ
ఎనలేనివాని చక్కనివాని నావాని
గావించగదవమ్మ సగ్గిలమ్మ

పైడి రతనాలసొమ్ముల బరగ నెత్తు
పసుపుకుంకుమ తెల్లనివసనములును
కప్పురము గంధమును మీకు నప్పగింతు
నాదుమగవాని జేయరే నల్లవాని.

క॥ అని యెద గుంగుచు నుండగ
దనకడకున్ వాణినాగ దనరెడు చెలి రి
వ్వన వెన్కకైపుగా జని
కనులఁ గైదమ్మిదోయి గట్టిగమూయఁ.

క॥ ఉలికిపడి పిదప గను ద
మ్ములు మూసిన మగువపేరు బొల్పుగ దెలియం
గలుగుటకై మదిలోపల
దలతుఁ జెలికత్తెనాగ దనరెడు వాణిఁ.

చ॥ అనిన నెఱింగెనంచు జెలియంతట జేతులుదీసినన్ గనుం
గొని చెలియా నినుఁ దెలియుకోరికబల్కు వెలంది వేడుచుం
డినతరి నేలవిప్పితన నెచ్చెలితెల్వికి సంతసించి లో
దనపొరపాటు గూరిచి చిరాకుపడఁ సరిగాంచి రిద్దరుఁ.

ఉ॥ అంతటసత్యభామ కనులందము చందము విన్నవోవుటల్
మంతగు నాటపాటలను మాని కలంగుట గాంచి లోన నే
వంతయు లేక యిట్లు బలువన్నెలు చిన్నెలుడిందియుండ దీ
జంతయటంచు నెంచిపిలుచన్ బలికెన్ జతగూరుచుండియున్

చ॥ చెలియయిటేల గుందెదవు చెప్పుము నెచ్చెలులెవ్వరైన పెన్
గలత యొనర్చిరో మొగులు గారియపెట్టిరొ లేక తల్లి  సీ

కలమట జేసెనో యెవతెకైనను నీపయి నీసుగల్గెనో
తలిరులవిల్లు బూములికి దాలిచి కంతు డలంతఁబెట్టెనో.

సీ॥ బంగారు జరతారు పట్టుచీరెలు వేన
వేలు చిల్కలయందు వ్రేలుచుండ
రహిమించు పైఠణీరవికె లెచ్చకోలంది
సనువైన పెట్టెల నదిమియుండ
సొగసైన సొమ్ము రోజున కొక్కరీతిగా
గట్టించి బరిణెల బెట్టియుండ
గమ్మకస్తూరియు గంధమ్ము పున్గు జవాజి
మేలి చెక్కడపు డబ్బీలనుండ

పట్టెమంచాలు పరుపులు పల్లకీలు
జాళువాగిండ్లు మించు టద్దాలు జెండ్లు
నాటచేడియలును పనిపాటవాండ్రు
గలుగ నీవిట్టు లలమట నలగ నేల.

కం॥ అని సచ్చెలి పల్కిన విని
తన మది కోర్కెలును సిగ్గుకడబా టొదవిం
చిన నేమియనక పెనుద
వ్వనకుఁ జేయెత్తు సిగ్గు బొరలగ ననియెఁ

గీ॥ మూడుజగముల బోటులతోడఁ గూడి
యొప్పుగా జెప్పరాని పల్కుండదరయ
గాన దెల్పెద నీకు నిక్కంపుమాట
వినుము మేల్కళ్ల చెలులు పాల్గొనగవలయు.

చ॥ ?లుకవటీరు ప్రాముటీకి చెచ్చెర గ్రక్కొని నాయెడన్ హళా
హళి యొనరించె తాళఁగలనా యెలనాగల నాము మీర బి
ట్టలయఁగ జేయ నాపసియటంచు కడంక వడకంజేసెడుఁ
వలమురితాల్పుఁజేరి తెకవా తరువాయి యెఱుంగఁ జెప్పవే.

సీ॥ మురువుమేన్గలవాని సెరిమించు నెరమించు
నొరయించు సిరిగూడియుండువాని
నునుపుజెక్కులవాని ననతూపులననోపు
కనుచూపులను సొరుగాంచువాని
బలుపువ్వుటమ్ములు గలవాని గళవాని
గలవానికొడుకుసొంపొలుకువాని
యొగుబుజంబులను జెన్నగువాని నగువాని
నగువాని కెమ్మోవి సొగసువాని

మేటియగువాని రక్కసికూటువులను
గోటమీటెడువాని జమ్మటియపట
డంబుమీరంగ జేయుపుట్టంబువాని
గలుపగదవమ్మ నామేను నిలుపవమ్మ.

క॥ అని తనచెలి పల్కినయం
తన సత్యకు నసియె నింతతహతహ జెందం
బనియేమి గొల్లబోంట్లం
దనియించెడువాడు నీకు నౌకరుగాడే

శా॥ నీవాల్చూపులు నీదుముద్దుమొగముఁ నీలేతనవ్వుంబసల్
నీవాటంబగుగుబ్బచన్నుఁగవయుఁ నీమేలికెమ్మోవియుఁ

నీవేసంబును నీదుజవ్వనము నీనెమ్మోని సింగార మూ
హా వెన్నుండుగనుంగొనన్నిలుచునే యాహంత నేపేనియున్

సీ॥ వలరాజు పుష్పాటమ్ములకు జిక్కని గిట్ట
తమిజెందనట్టి గోనముః పుట్ట
తలయూచి యొక మెప్పుగాలను గాంచనివాడు
గడుసిరాకికి బాలుపడనితేడు
పలుకరించగ నాసపడని రాకొమరుండు
నవ్వనుంకించని జవ్వనుండు
చేసన్నఁ నుకనుల్ సేయ నెంచనిజాణ
పలికింతనె రిచ్చపడనిగాణ

కులుకుచూపులు జూడని కోడెకాడు
మదిని యువ్విళులూరని చదుగుకాడు
లేడుగద నిన్ను విని కన్నపోరిడలందు
వెన్నుడాగునె సీలాగు విన్నవింప.

చ॥ అని చెలినూరడంబలికి యమ్మరో నేనిక నల్లనయ్యయుం
డిన పటికంపుమేడను కడిందికడాని మెఱుంగు మెట్లదా
రిని జని లోనికిం దరిసి రివ్వున చెన్నెకిపట్టు పాన్పుపై
నసరుచునుండుసామిగను నమ్ముఁ కుఁదనివారగాంచియున్.

గీ॥ అంతిపురిలోని వెన్నుసిల్లాండ్రనెల్ల
నెడముగా జేసి యడను గావించిమించి
మించు నీసారునెల్ల గుప్పించి తమిని
ముంచితేలించి యిటకు రప్పించుదాన.

క|| చూడుము నా గడుసరితన
మోడకు వాడకుము తెగువ నొందన్ మదిలో
జూడకు మిందుల కొరులన్
వేడకుమని వెడలె బోటి వెన్నుని కడకున్.

క|| అని చెప్పిన పని యతనిం
గనుగొని శౌనకుడు మొదలుగాఁగల వారల్
వెనుబత్తి సత్య యను నీ
ననబోడి యవలికతన్ వినన్ వలతుమనన్.

## ఆశ్వాసాంతము.

క|| వినిచెన్ బాడిన గొప్పన
గనిరన్ మొగ్గిక్కిన దలంపు గావించిన బి
ల్చిన వేడుకొనిన గూడిన
జనుషన మన్నించువాడ జగములతేడ.

అచ్చ తెలుగు కంద గీత గర్భ చంపకమాల.

చ|| ఇల సిరినేల్లొరా జగము లేద్దేరగావగ జాలువాడ ది
ట్టల వటితో కడుం దగుకడానిపటంబును దాల్చుతేడ రొ
మ్ములనరుదారగామిగులుమేన్మెరుగొప్పెడిమేటిపోరిడ మె
ప్పుల బరణీ కలం పగను బొల్చెడు సోకులవంచురాయడా.

గర్భ కందము

క|| సిరి నేల్లొరా జగములే
ద్దేరగావగ జాలువాడ దిట్టలవలతీ
అరుదారగా మిగులు మే
న్మెరుగొప్పెడి మేటిపోరిడ మెప్పుల బరణీ!



శ్రీరస్తు.

# శుద్ధాంధ్రనిర్వచన

# సత్యావివాహము.

## ద్వితీయాశ్వాసము.



క॥ సిరులకు నిరవగువాఁడా
సరిజేరనివారి పీడఁదలఁపని తేఁడా
కరకన్రిక్కనిసూఁడా
సెరిజనముఁ నేలుపోఁడిమ నేర్పుగలాఁడా.

గీ॥ సూతుఁగను, సత్యవీడ్కొని సుదతిమిన్న
వాణి తనయింటికేఁగెడువరకు తమ్మి
సోఁకయుమొగవట్టి ముడువఁగాఁ గలువలడర
ఒడిరెయు బసమాఱికడలి మించొడవు బడలె

క॥ పసమాలి సెసయను పడతిన్
గడువేడుక బెండ్లియగుచు గడుసరివేవె
గ్గొడువున జల్లిన బుక్కాఁ
పొడియన నెరుపారు సంజ బొలిచెన్ బుడమిన్.

ఉ॥ పేర్కొన చిమ్మటన్ జమునిని,వెన్నుని,గాటుకకొండ సోకులన్
మార్కొనియేన్గులన్ జమునమానగు చీకటిచెట్లు గాకులన్

దార్లగాని కస్తురిఁ బిగుల నష్టపుష బ్బును గెల్చి యెంతయున్
గార్వాంనుచీకటుల్ గవిసె గన్నులు గప్పడకుండ గాటమై.

గీ॥ అంత సత్యయు నెంతయు నవ్వంత సుంత
నిదుర జెందక తనవారి గుదురుకొనక
పుప్పొటమ్మెల యొకిమాని పోటువలన
నత్తరము బొందు పీన్వాదు తాల్మిగుందు.

ఉ॥ కుమల్యాడుచున్న దాసి విరికోటల నేయకుపూని యింక నీ
నెయ్యము చాలు గాసి తరి నీకిది యే యని యంతు వేని మీ
యయ్యకు జెప్పి నీదు పొగరంతయు చెప్పెద దుర్భ్రగు పొంగినట్టి పాల్
పొర్లు ల్యాకిబాలు సుమ్ము మదిబొంగెసు కుర్ంగకు చిన్న పోలికన్

గీ॥ పూవిలుతుడేడ పెద్దనిప్పుకలతోడ
నెకనిటులుగాడ బలుముల్లు లేయుటడ
కంతుడవు గావు నాపాలి దూతరాత
పీవు గాకున్న కనికరం బింతపవ్వె.

క॥ ననబోడుల నొప్పించుట
మొనగాని తనంబుగాదు ముమ్మొనవాల్గ
ల్గిన జోదునంటి వానిన్
గని తాకుము నీబడాయి కనుపడు నచటన్.

క॥ సిరిగల్గు దొరకొడుకు నని
గరువంబున గ్రిందుమీదు గానక బెలుచన్
గరితల గారించెద విది
దొరకొడుకులకుండ దగిన దొడ్డతనంబే.

ఉ॥ బంటుతనంబు జూపెదవు పాలసుడా యిది యెందుబోయె ము
క్కంటిని మారుఁ గొన్నపుడు కాలిచి ప్రేలిచి బూదిజేసినా
డంట తలంచి జూడ బువ్వుటమ్ములు తుమ్మెదచాల్పు టల్లెయున్
దుంటలవిండ్లు పైకెగయు తుంటఱిమూఁకలు జంటలేవా కో

సీ॥ వేడితో దాడితోడ్డోడ జేసెదవె నీ
వారుసంబులు చెట్టపాలుగాను
తియ్యనిచెరుకు చేతికినంది జడిపింతు
వొప్పనే నీవిల్లు పిప్పిగాను
జుమ్మను తేంట్ల టంటమ్ము నిపించెద
వేర నీగోనయు మెండెందోడూర
వెసమీర గసిదీర నుసురు లూడ్చెదవేర
నీవాడిముల్కులు నేలగలియ

పువ్వుబోడుల కొమ్మల బూసిక్కమీర
రవ్వజేసెద విదియేటిరాచఠీకము
ముప్పుతిప్పలు బెట్టెదే తప్పెరుగవె
చిన్నవే యింక నీమేను ప్రేలిపోను.

గీ॥ అనుచు నీరీతి గవికరంబును దారంగి
తిట్టుచున్నంత దూరుపుదెసపడంతి
చలివెలుగు రాక విని కురుల్ చక్కజేయ
దీయు వెలిదువ్వెనన దూర్పు తెల్పుదోచె.

సీ॥ వగబాసియున్న యాల్మగలరాయిడి సేయు
బరతెంచు మరుచుట్టు వాలనంగ

గీ॥ కంతుపెనుబారిలోఁబడి యెంతొ కలత
బారకుండ సత్యయపుడు గోరుచుట్టు
పైని రోకటిపోటు కైవడిని నగ్గి
కురియుచును మింటవెల్గు చందురుని గాంచి.

క॥ అల్లునికి తోడుగా పెను
బల్లెంబులు బూని చెలుల బాముల బెట్టన్
మెల్లగవచ్చితె పెద్దలు
దెల్లముగా గన్న మోము తెలుపగుటెకదా.

క॥ పుట్టితి సిరి తోడై తో
బుట్టిగ బాల్యుడవై జగములందుగు చెల్మి
దొట్టితి వెన్నుని మఱది వి
కట్టా నీవిట్టు జేయ గాదనరె యొకుల్.

చ॥ గురుని పదంబుతోడ గనగూడినవాడవటంచు లోన దా
నెఱిగియు నెత్తికెక్కునను నింతుల నిర్వురిగూర్చి కొంకకే
మురియుచు మిత్రిగొంగతుకి మోసమొసర్చెదు దుండగీంద్రకున్
గరితలు పెళ్లులైన వెలకత్తియలుం బలె గానుపించరే.

క॥ సిరితోఁబుట్టితి వని లో
కులు తెలుగక యింద్రు నిన్ను గొప్పగు విసము
త్తరి దరికోనగా బుట్టిన
వెరవరి విది నీక చెల్లు వేరన నేలా.

సీ॥ కడలి బెంచిచ్చు సాపడి సుంతమే న్వంచి
విసముతోడను బయల్ వెడలివచ్చి

కుడుచేసిన మావింజము
దడదడలాడించు సుమీ కొదమసింగంబుల్.

క॥ అమ్మా యయ్యెలుగుల నా
బమ్మెట్లొనరించె నొక్కొ పరుసడిలో సిం
గమ్ముల దమ్ముల జేయును
రమ్మా సాపాటము జాతురాయడ ఖుంకన్.

గీ॥ అనిన సంతోసమంది తే డట్లె యనగ
వెంటనిడుకొని యొకజాలు వెంబడించి
అడ్డె పానపాన మబ్బానువట్టె చోటె
యెంతదవ్వైన చెలకప్పె యటంచు
నిన్నిదే యంచుగొని పోయి రట్లతేని.

సీ॥ మున్న గస్త్యాంశురా బుకమిసాగిలి మ్రొక్క
నుండుమిట్లన బండియున్న వాని
పాపసొమ్ముల సామి రాపణంకులకున్కి
యగు నేటి చెలిప క్రొక్క తగులు కాని
నిండియా నడిమికి రెండుపంపులుగాగ
నమరించు పెద్దగట్టైనవాని
కడుమెకంబులకు దొంగలకు తెండ్లకు నిరా
బారులకెక్కరైయి పరగువాని
తమ్ములకు గల్వ పూవుల కిమ్ములైన
వలపు తెలిసీటి కొలకుల వాసిగాంచు
నెత్తముల వేల్పులచ్చరల్ నెత్తమాడ
వేడుకలుగూడ జూచెనా వింజమప్రభు.

క॥ కని యిది కాంచినజాలిగ
మనుటెందుల కేంద్రుబూంద్లు మజ్జారే యు
మ్మినుపట్టి నిక్కియెగురం
జనదే యీ గట్టుకొనకు జనువారలకున్.

చ॥ అనితలపోయుచుం గరకుటమ్ములగోరిల్లులినాము టేనుగుం
బెనసిన కారుసింగమును మోటెలు గుంచెనుద్రుప్పిగోరపం
దినిబాగ రెక్కుడున్న నొకదెబ్బకు దెబ్బకుజల్లులూడిపై
దునిసిపడన్ వడిన్ నెరపె దూలకదెంపు జెలంగ నెంతయున్.

సీ॥ దిట్టమాయేన్గు గీపెట్టుచుండగ దోడ
మట్టిబిగ్గనబట్టి కొట్టనేల
గొరివ్యాడిగోళ్లత్తి కొట్ట రిప్పునవచ్చు
కొరిల్లులికనయీటె గుచ్చియెత్తు
యేనుంగురా తల పైనుండి కుప్పించి
యురుకుసింగము తల నొడిసిపట్టు
కొరికవేయగనోరు దెరచివచ్చెడి పెద్ద
యెలుగుబంటిని చెట్టు కేసిమోదు

దుష్టులను జేరిల్లు నడవిపందులను దూల్చు
కణుజులను గెల్చు యేదులగమినవల్చు
లేళ్ళసవరాల నెనిమిదికాళ్ళవాని
వాల్మీకంబుల గూల్చు నవ్వారిగాగ.

క॥ పటుచియలేడిని బట్టున్
బిటులతివియుక సింగములను బీరమడంచున్

మొఱకుం బందులఁ గొమ్ముల
విఱుచుచుఁ బట్టుకొని మింట వేల్పులు వొగడన్.

క॥ మాటిడఁడు చెట్టు నెక్కఁడు
చాటుండఁడు వలలు బొన్ను సైనము దేఁ
ప్పాటనొకండు మెగంబుల
గాటముగా జంపె నదియకన వేటయనన్.

క॥ ఇటు వేట సల్పుచుండఁగ
జిటుక్కుమనకుండ నొక్కసింగము ననవె
న్కటి వైపునుండి పైఁబడి
పటుక్కుమనిపుత్రియ కొరికి పడఁద్రోసెనన్.

క॥ పడఁద్రోసి బొమ్మువాఁగన్
గడు మెరసెడి యాశమంతకము గైకొని బ
ల్వడి బాఱుచుండె దిన సె
య్యడకో సంతోసమెంతయేన్ విఁసిల్లన్.

గీ॥ ఆ త్తఱిని జాంబవుండనునట్టి యెలుగు
బంట్లు తేఁడల్ల యేనుంగుపగతుచే శ
మంతకము వెల్గుటను జూచి వింతఁబొంది
కొడుకునకు దీనిఁ గొనిపోవ గోర్కెఁ గలిగె.

గీ॥ పచ్చకంటిమెకము బరుపడి మార్కొని
పీలువెంట వెన్కకాలుబట్టి
పుడమిదిప్పికొట్టి గుడిమింగువానికి
తలుపు లప్పడములవలెను గాదె.

క॥ సింగము నిటుజంపి రతన
ముంగొని జాంబవుఁడు వింజపుంబొరియకుఁ దా
బొంగుచు జని పట్టికి ని
చ్చెం గొడుకులకెంతవారు జేయరె యితవుల్.

క॥ అటవేటకు వచ్చుదొరల్
కటకటపడి తేని నడవిగలయ వెదకి యె
చ్చట గానక డెందంబులు
దటుకుతటుక్కనగ గూలి తలపోసిరిటుల్.

సీ॥ రాజుగారైన సత్రాజి త్తైదువచ్చి
మాతమ్మ జేడని మనలనడుగ
నేమిమాటాడుదు మెందుజూపింతుము
భంగకారుడు వాతపతి బహుపిప్రి
యుండు మాపినతండ్రి యొగి మాకు దెచ్చిన
పున్గుబిల్లులు సింగపుంగొదమలు
చిలిపిట్టలు మంచి పీలుకట్టాణిము
త్తైములేవి తెండు తేతెండునాగ

నొరెటులనాడు మనకు సొంపాగుసత్య
సన్న మనలను బిల్చి మాచిన్నతండ్రి
వచ్చెనే నాకు నేమేమి దెచ్చెననిన
నేబదులుమాట నుడువుదు మేది తెరువు.

చ॥ అనియిటులెంతయేని దిగులందుచు గుందుచు పీడు జేరితే
నినిగనియంతయుం దెలుపనెక్కొను సెవ్వగయగ్గివారలచే

వను ఫులు వామినంటి రగుళ్లై పొగిళ్లై సెగళ్లై తోడంగి భ
గ్గన వడిమండ నాప్పురని యాతడు బిగ్గన నేడ్చె నేమనన్.

గీ॥ అనుగుసైదోడు కానరాడనెడి పల్కు
బల్లెమట్లు వానివీనుల జొచ్చి పాఱె
గాన నవరెట్టు లోఁదార్చ లేని వినఁగు
నమ్మ డాయంచు బలవించు నామ్మసిల్లి.

ఉ॥ కాయను నెందుఁబోతి వలుకాయను గూళల పాలిత్రోకచు
క్కాయను మానికంపు బలుకాయను జక్కదనంబు కెల్లని
క్కాయను రావి దేమిపలుకాయను ఠియ్యని లేతమావిమో
కాయను నాయమేకదుడుకాయను గాయను గాయనుంగనున్.

ఉ॥ పాయను నేరమేమి బలుపాయను మంచిగొనాల మేలిరి
ప్పాయను మానిజంపుకరపాయను నాకడరార మేమ్కిఁకు
ప్పాయను డాగితేల పసుపాయను సౌరగు గంతుపువ్వుదూ
పాయను మాయదారిమఱపాయను బాయనుటీయనుం దనున్.

చ॥ డాయను రావిదేమి జగడాయను నెక్కడురారమంచిగో
డాయను నీకు నింతయగడాయను, నన్ను మరిపించుపోఁడు నీ
డాయను బల్పజెర్లమగడాయను నీయొకలెట్లునైతు దో
డాయను నెవ్వరేని బుడుడాయను గ్రొమ్మరుడాయనుం గనున్.

ఉ॥ రోయను పప్పులేమి యుసిరోయను నాకెదిదారితమ్ము గ
ట్రోయను నేకతమ్ముకుమొఱ్ఱోయను నిన్నెగవెట్టుఁజుఫ్రరా
రోయను నీకిదేమియొకరోయను నీవలె నేరు వేటబో
రోయను యొంతపంతిపితిరోయను నేనెటునైతురోయనున్.

క. అనియిట్లు తోడబుట్టిన
ధనువున నెనగానకాని జాలింబడి తూ
లిన యెదసోలిన మెయితో
డను గొంతశమంతకం బెడందందోపన్.

ఉ॥ నేరుపుమై నెదం దనర నిన్ను గనుంగొని పెద్ద లెంచగా
నేరరు నీవెలన్ సతము నిన్ గనిమంటిమి నీగొనంబు బం
గారము నీను నీకతన గాదె జగంబున కెంతొ మేలు వ
వ్యారతనంబ నీ యొసలు వాసిన నాయొడ లేల గాల్చనే.

సీ॥ తమ్ముడా హాశమంతకమా యెచటనుంటి
వెవని పాల్పడి కలివిచ్చుచుంటి
నీదు సింగారంబు నీదు బంగారంబు
తరగల్లై తిట్టల్లై తనరునహహ
నీవుగోర్కెలను నిండించు నింతులుఁ బీద
లెటువంత దరిగాంతు రెందుమందుఁ
పోట్లులాడనివాడ పొద్దొసంగిన లచ్చి
పోయితే నిల్కడ బూనలేవె

పోలుపుగలవాడ వేవెల్గు వెలుగుదాన
అనుగు చెలిదిట్ట సుకముల కోటపట్ట
మురిపెమిడునంట కరువుల దరుముపంట
యంచు బలవించు బ్రిదుకు టెట్లని తలంచు.

గీ॥ ముని శమంతక మణిగ్రసేనున కొసంగు
మనుచు గరివేల్పుగోరి నట్లచటనిచట

వారలాడిన మాటల బారజూచి
యరసి యిదివాని పనియె కానగునటంచు.

శా॥ ఔరా తుంటరి మానికంబునకునై యాసించి నాతమ్ముని౯
నేరంబింతయు లేనివాని దునుమ౯ నీచేతులెట్లాడెరా
యోరీ నల్లనివాడ నీకొలువుచెయ్యల్ జూపితే విన్నవా
రేరుంజీయనరోయటంచు బలుమారెగ్గెత్తియాగెల్లెద౯.

కం॥ మాటల బెరకతలందు౯
నూటీ పోటీ నుడువుల నూచాయల న
మ్మేటిపయి నపనెపమ్ము౯
జాటించె నిజంబటంచు జగము న్నమ్మ౯.

సీ॥ ఎన్నైనను దన్నింత హెచ్చుకించ
గొల్లయిల్లాండ్రు మరగిన కోడెకాడు
దొంగపనినట్టు టక్కరితోడబుట్టు
వెవ్వడవ్వాని చెయ్దుమం చెరుగజెప్పు.

క॥ ఈగాగున రోకంట౯
రోల౯ బాడంగ నతడునుం దెలిసికడు౯
దూలియొకనేమి తెరగని
లోలోదలపోసి తనకొలువ్రునన్ జెప్ప౯.

చ॥ పనుపడనాలకించి బలభద్రుడు జెనంగనరానికిన్క భ
గ్గనవడిమండి తోకచురుకానగ ద్రొక్కినత్రొచుతీతె నా
యనుగగుతమ్ము గుఱ్ఱనిటులారడిసేయగ వట్టితప్పుమో
పినపెనుతుంటరిం దునిమిపెంపుజెలంగెద నిప్పుడంచు నే
పున దననాగలి౯ బయికిబూనిచి పట్టి చనంగ నడ్డమై.

శా॥ అన్నా తొందరయేల యాగుమెదిజేయంబూనినన్ బెద్దలన్
విన్నాణంబుగ లట్టి వారలను మెప్పించన్ వలెన్ ముందుగా
దెన్నుంజూడక మంచిచెడ్డెరుగకెంతే తొందరల్ జెందువా
రెన్నండున్ జెడిపోయిరంచు వినవే యిట్లేలనం చోర్మిమై.

గీ॥ కినుకడించు సాత్యకిని జూచి నందుని
కొడుకు పెద్దవారి నడుగవలయు
ననినమాట కెంతొ యలరి మంతులబిల్చి
యెరుగ జెప్పి కర్జ మెట్టులనియె

క॥ ఎరిగినవారల కెల్లర
కెరుకయగుచు జగముమనుప నిఁబుట్టిన నే
ర్పరిమంతులచే నెరుగుట
తెరగిదియని యెల్లరకును దెల్పుటగాదే.

చ॥ అనవుడు మంతులిట్టు లనిరయ్య వినంగదె మాయెడందదో
చినయటు నిన్న వించెదము జెప్పగలాడిల లేదు మీకు త
మ్మునిగడ తేర్చి యారతనమున్ గొనినాడ వటంచు నీకు వ
ట్టి నెపము వెట్టి వట్టి చెనటిన్ బరిమార్చగ జెల్లది త్తరిన్.

ఉ॥ ఇప్పుడ వానిజంపు నెడ నెల్లరు మానికమీరెకొంటిరన్
దప్పును మీపయిన్ దమయెదం గుదిరింతురుగాన దానినే
చొప్పుననైన బట్టికొని చూపి వితానెపమెల్ల మాసివా
నెప్పలుగాకిదున్న నహహా యని మెచ్చు జగంబులన్నియున్.

గీ॥ అనిన సంతోసపడి వెన్నుడౌను నాగ
నుగ్రసేనుండు బలరాము డొప్పుకొనిరి

వనములుం గొడుకులు దమ్ము లనుగుచుట్ట
లెల్లవారలు నిడియ పోచెల్లుననుడు.

చ॥ నవవిలుతుండు సాత్యకియు నల్లనిబట్టగలట్టిజెట్టి కం
తునికొమరుండు సాంబుడును దొడ్డమగంటిమిగల్గు చుట్ట ల
ప్పనికయి జాడదీయగ వాడు వజీర్గొక కొందరంటిరా
జనియె బ్రసేనుడేగు కడచాయల నా కరివేల్పునెట్టనన్.

చ॥ చనియడవిన్ వగస్వనకి చచ్చియు లన్ బడియున్న యాప్రసే
నునిగని పంతబొంది యిటనొంచెనె కట్టిడి బన్మ్రవాని లవా
యని రతనంబుకై వలువ నిస్సియు గుర్తుకనున్ మొలన్ గనుం
గొని యొటలేక యుండిన దిగుల్పడిరంపరు వెన్నుడంతటన్.

చ॥ ఇదె కను డొక్క సింగమిట నేడ్తెర పీసిని దున్మివైచి పే
ర్చెవెలుగొందుమానికము నెంతయుగైకొని పోవనోపు ని
య్యది పెనుగొర్లజీరు గురు తల్లవె పల్లమి నాత్తెపుత్తెనా
నిదె బువి కాలిజాడయని యేర్పడగా నెరిగించి పిమ్మటన్.

గీ॥ కడగి బొబ్బమెకపుగాలిజాడనుబట్టి
యెల్లవారు వెంబడించి నడుమ
నల్లనయ్య యడవినడివారమున కేగి
డెబ్బిల్లియున్న మెకపుతేసిగాంచి.

చ॥ ఇదియొటులిట్లైనంచు గల్యయెల్లరుసుం బరికించిచూచి యి
య్యది యొకయెల్లుతేనిపయినాలము జేయుటగూలెనంచు దా
రెపలదలంచి మానికము నెందునుగానక మిగ్రింగబోలునం
చూడవినతొందరన్ గడుపునోరిమిజీలిచిచూచి రద్దొరల్.

క॥ అందును గన్పడకుండిన
నందరు నయ్యేలుగుబంటియ కోనెంబో యిం
దెందును లేదని సాగిరి
ముందరనడువంగ నెలుగుభోయినజాడన్.

గీ॥ ఎలుగుతోని యడుగు లలవింజమున
నొక్క పెద్దసొరెకుబోవ భీతుజెంది
యెల్లమూక మొకము లెల్లగా నటనిల్చి
కత్తినేస్త్రియొకడె గవికి జనుచు.

క॥ ఓనేలతాల్పకలదా
మానికమిటననెడు కృష్ణుమాటకు సరిగా
నోనేలతాల్ప కలదా
మానికమిట ననుచు బల్కె మలయయ్యెకలన్.

గీ॥ మంచిదంచు జగము మంచులావరినన
కట్టయెదుకనున్న గుట్టబోరియ
జూల్మెకంబుగొందమసొరియజొచ్చెకరిపి
జొచ్చువారలెల్ల జూచుచుంత.

సీ॥ నెర నల్లచీమలై నేరేడుపండులై
కాటుకపిట్టలై కాకులగుచు
చినచిన్న ముంతలై చిటిబాన దొంతులై
వింతలై బలిసిన దుంతలగుచు
కరియావులై కలంకారు దువ్వలువలై
యామటాబోతులై హత్తులగుచు

ఉ॥ ముత్తెపుదోరణంబులును ముగ్గులునుం బతాకలున్ బళా
పుత్తడిగోడలున్ సొగసు బొమ్మలు పంచటరుంగులిన్నెలున్
చిత్తరువైన మంచములు సెజ్జలు గద్దియలున్ సహవ్వారే
యిత్తరిఁ గొంత సేపిచట నే దనివారఁగ నిల్చి చూచెదన్.

గీ॥ దీని యొడయఁ డెంతదిటముగల్గినవాఁడొ
యెట్టిజెట్టులఁ దెసి పట్టువారొ
యెంతసొమ్ము గల్గి యీమేడ నున్నాఁడొ
చొచ్చివాని నిపుడె చూతుఁగాక.

గీ॥ ఎఱుఁగనట్టి నెపము వరపి సత్రాజిత్తు
చూపెఁగాక యిట్టి చోటువింత
వానిమేలు మఱువవచ్చునే యెట్లైన
దివిరి యిప్పు డప్పు దీర్పవలయు.

క॥ అనియెన్నియొ తలఁచుచు మె
ల్లన ముచ్చుంబోలి యడుగు లం బెట్టుచు లో
జన నుయ్యాలో జొంపము
లని పాడెడి కలికిపలుకు లట వినఁబడియెన్.

క॥ వినఁబడిన దల్పుచాటున
దనమేనుం గుంచి వినుచు వాదిని నుయ్యా
లను వ్రేలు శమంతకమున్
గని యబ్బురమంది యిదియ కానగు ననుచోన్.

ఉ॥ ఏడువబోకుమన్న యిది యేర్పడఁ జూడుము శమంతకంబు నీ
వాడుకొనంగ నీయనుగుటయ్య ప్రసేనుని జంపుసింగమున్

బోడిమిమీఁద నెక్కి యిటఁ బొల్పుగఁ దెచ్చి యొసంగెనీకు నా
తోడని పాఱె దాది చపలో నెలఁ గోయిల కూఁతలో యనన్.

చ॥ అదివిని సందియంబుడిగి యల్లన నుయ్యెలఁ జేరఁబోయి య
మ్మృదితకు వెన్కనిల్చి చెలిమోమునఁ గనుంగవతోడ నెద్దియో
మఱి నిదలంచునట్టితఱి మాయలమారి వశీగుమానికం
బడటున నందె దొంగతనమం దతనిన్ సరిపెట్టురే యొకల్.

గీ॥ ఉలికిపడి దాదికతనంబు వొప్పుటెఱిఁగి
గుండెజల్లన నో జాంబవుండ రశ్మి
మానికము నొక్క మాయలమారిదొంగ
యెత్తుకొనిపోయెనని యెలుంగెత్తి పిలిచె.

వ॥ అలమాటలన్ వినినంతన యెయ్యాలుగు రాయం డుక్కుపెంపెక్క మో
సలకున్ రివ్వునవచ్చి పైదులకి రోసంబాఁకగాఁ బట్టి ము
చ్చిలి యుందే గెదు కట్టి దొంగ యని మాజెట్టిన్ యశోదమ్మ ము
ద్దులపట్టిన్ నెరవాకికజ్జములయందున్ గట్టి డిట్టిన్ వెసన్.

ఉ॥ పట్టినవెన్ను దుండలకు పాటును జెందక వానిచేతు లి
ట్టట్టనకుండబట్టి యొకలంతయు జాంబవు గ్రిందినుండి వెన్
దట్టునకేగజేయగ నతండట వెల్కిలంబడెన్ బువిన్
గొట్టినగోడిపిళ్ళవలె గొబ్బునపింజము మాఱుమ్రోగగన్.

చ॥ పడి కనురెప్పపాటున జివాలునలేచి తొడంగి నిల్వమీ
పిడికిటిపోటుచేత నిను బిల్కుర జేసెద నోర్వవచ్చునే
పిడుగున కోర్చువాడయిన పెన్పగవాడవయేని నిల్వుముం
చోడుపునవచ్చి వెన్ను సెదసుక్కన నెత్తురు గ్రక్కమోదెన్

ఉ॥ సీవిరదెబ్బ యంచతననిన్ గని దాగయిదోయియుందు గా
మూవకిబూని కాచుకొన బోలు నిదే సమయించు నిన్నటం
చూదిపయిన్ బడన్ విడువనొక్కెడ కోసరిలేన్ రవంత య
మ్మొమ్మదునకొక్కబండనురుముం బొడుముంబలె నయ్యె
నయ్యెడన్.

చ॥ పేగతురువచ్చి మార్కొనినపట్టను వారినడంచబూని యొ
ప్పాగ సమకూర్చు తాలుగొనిపోడిమి నక్కరివేల్పుపైపయిన్
దెగి జడివాననా గురియ దేనువ డాల్గొని యొడ్డవాని బ
ల్మ్రాగటిమిజూచి యయ్యెడపిమన్నియ యబ్బురమొంది
చెచ్చెరన్.

గీ॥ బరువయిన యొక్కరాలి కంబమునుబూని
పేయ బెకలించు వానిచేదోయిబట్టి
నడుమగల కాలికంబుంబు బొడుముగాగ
బట్టుమోదెను పలుమారు పింజనద్రువ.

ఉ॥ పెల్లుగ జీమపుట్టెను బీల్చి మెగంబులపెద్ద యెట్టులే
మెల్లన బట్టునూర్చుకొని మీరితకిన్కనొడ ల్వ్రాదిల్చి యా
నల్లనిసామిపై కురికి నా యెదుటంబడి యెట్టుపోయెదో
గొల్లడటంచు నొంచితివౌకో యని బెట్టిడితోడ పైబడెన్.

క॥ పిడికిటి పేర్చిటులగాల్లన్
మడమల మోకాలిపోట్ల మరిపీలగు నె
త్తైడల నొకరొకరి మోదన్
కడగుట నప్పారు బీతుగలిగించె నటన్.

కం॥ మబ్బును నేలయు బంగరు
గుబ్బలియున్ వింజమానదుకొండయు బుట్టియున్
బొబ్బమెగము దలపడిన
యుబ్బరమైతె నచటివారి కయ్యపుజూడన్.

కం॥ పిడుపరు కదనంబారరు
జడియ రొకళ్ళకు కింకజాలునారునే
పుడుసరు పేర్గడుగ రదె
కృడికయ్యమొ పెన్సిప్పోట్ల గాసిలిరురకన్.

ఉ॥ అంతటబాంబునంతు దెసమై నిలువంబడి యోటకిట్ట నీ
యంతటి జెట్టిసందువినిస్తున సెలుంగను పేల్పులైన నా
కంతటినుంచి పారుదురు పాయని బిట్టుగ గద్దరించినన్
దుంతవనా పద్గముచు దుడ్డును దున్నను నీడి జారెదున్.

చ॥ వినుమ పుసు రాముడట్ల తొలువేలుపుట్టి నడంచుపట్టునన్
బసిగొని సోకుమూకలను బల్విడితో విరుచ్చిపులట్ల ను
గ్గానకిచినావ గొంపగను నుబ్బునసంగ్రాము గట్టుచోటరా
యని యదమెచ్చు పెన్పులి నదంతయు జెప్పగనేల నీకిటన్.

సీ॥ తొలిసరాజ నీకివాములునాగ్గటకిబోయి
నడి తానమొనరించి వచ్చునాడు
మోకాలిలో పేపెముద్దు నాటిననోర్చి
జగముచుట్టము నొద్ద జదువునాడు
కాండుకాండను నెల్లగముల నన్నిటి జక్క
జేసి కయ్యపువిద్దె జెప్పునాడు

కారుమబ్బులువోలె గప్పిన రక్కసితేండ్లు
కరకుటమ్ముల వాన గురియునాడు

సుంతయును మేను బడలదు చూడ నీ వె
వండవోకాని యనిలోన బెండువరచి
తేర మొనగాడ నీకగు నూరు పేరు
తెలియగా జెప్పు మొక్కింత తేటఁగొందు.

మ॥ అనుమాటల్విని వెన్నుఁడో యెలుగురాయా నేను ద్వారావతిన్
మనుగొల్లండను నల్లవాడ నగుటన్ నన్ గృష్ణుఁడంచంద్రుసం
దునకున్ చెంపుకుపట్టి నీరతనమున్ గొన్నాఁ డనన్ వట్టిత
ప్పును నేజెందుట నిందువచ్చితిని గొంపోవంగ వేయేటికిన్

గీ॥ అనిన జాంబవంతు డల్లనవనగి యోరి
మన్నె గొల్లడా శమంతకంబు
గొంచుబోదువెట్లటంచు పైమారొక్కనె
నీరసమున దవిలి పోరొనర్చె.

సీ॥ ఇట్టు మారొక్కని పెద్ద చట్టుపైపైచిన
నది వేఁబొజంగు పై యందెడిందె
నీరసంబున నగ్గి నారసంబేసిన
నది కారుచిచ్చు దిన్నట్లమిరింగె
నడిమీర గాలితూపడరింపవలపు ప
య్యెరయట్లు లోపలికట్టెపీల్చె
కినుకపై నీటిచిల్కును వీడ నొక చేయి
బట్టి పుడకలేనియట్లు గోరిలె

నోగిరంబులు పండుటుడిగి పేన్ వెతతోడ
ముసుగు పెట్టుక బిగ్గమూల్గువారు

చెరువులను బావులను నగ్గినురకబోన
బందుగులచేత నాకట్టబడెడువారు
నెంతగతిపట్టె ద్వారక కింతలోన
సత్యావో అక్కటా మొరోయనెడువారు.

క॥ చెలియని చుట్టంబని తమ
కెలయించెడి బోజుగటంచు నేలికయంచున్
బలుచాగియంచు వెన్నుని
దలకొని లాగించి పడిరి తెలగని వంతన్.

క॥ ఇటులెల్ల రేడ్చుయేడిచి
కటకట మనయేడ్పువలన గలదేమేలం
చటనున్న దుగ్గినింగో
ల్పుటకైగుమిగూడి గొల్లజోంట్లున్ మగలున్.

గీ॥ గొఱియలును మేకలును బడి కోళ్లు పెద్ద
దున్నపోతులు మామూలు లెన్నుకొనుచు
తెచ్చిబలిపెట్టి బోనమ్ములిచ్చుకొనుచు
సత్తిమాసాల నొకపెద్ద సంతజేసి.

క॥ మాబోనము ముందనుచున్
మాబోనమె ముందటంచు మాసత్తియటం
చేబిగదులో నుడువుచున్
గాబారైకల్ల పనులకావరులెల్లన్.

గీ॥ తలవిరియబోసి పసుపుమైనలది పెద్ద
బొట్టునిండార మొగమున బెట్టి వేప
మండలను చేతగొని గ్రామమునవయూరు
సివముచే గుర్తిడురమి యహాగి చెప్పెనెదియొ.

గీ॥ ఈపులకుగుట్ట విన్నాణమెసగుపుట్ట
యీగలకునట్టు కంపు పుట్టింటిపట్టు
మలపలకు వొంగలకు పూలమాదుగులకు
బంతిపాత్రైన యామత్తుపాకయందు.

గీ॥ గుడ్డలుతికెడువారును గోరుగువారు
కుండలను జేయువారు గొర్పుండినేయు
వారు గడమీదికెక్కెడు వారు మంద
గాచుకొనువారు కడుపార కల్లుద్రావి.

సీ॥ గాడ్పుచూలేను రాకాసులీరని యార్చి
కుప్పిగంతిడెడు నప్పుడొకడు
అడుగకయే కల్లు నవ్వారిగాన బో
యించికర్సనియీనిచ్చునొకడు
ఊకొట్టు వారల జీకొట్టుచును మిట్ట
విన్నాణమును జెప్పవెట్టియొకడు
క్రిందబొర్లెడివాని గేలెత్తి చూపియా
యనకంటెమేలు వెమ్మనునొకండు

కక్కువారలు చీకులుమెక్కువారు
తనదుపెండ్లాము కలజెప్పుకొనుచునన్ను

దాన బలుబూతులనుకొనబూనువారు
నైరి కలఁపందిరులచెంత నల్లరింద్రు.

సీ॥ రంకురాట్నము లొక్కవంక గిఱ్ఱనిమ్రోగ
నొక్కటగొమ్ము వాండ్రూదసాగ
గారడీండ్రొకదరి వీరణంబునుగొట్ట
రహి గంగిరెద్దులు రంకెవెట్ట
కెడపెటమంచు దప్పెటలొక్కెడ జెలంగ
గంటలూరక గణగణ యనంగ
మగవాండ్రు నాండ్రు హెచ్చగు సివంబుననార్వ
సుద్దిజెప్పెడువారు సుతులుగూర్వ

మూడుముక్కలపేకాట గోడిపందె
ములను జూదంపుబల్లలతులువలెల్ల
గూడి పలుమారు పోట్లాడు గొప్పగోల
యలముకొనిమిన్ను వగిలించునవనునందు.

గీ॥ గొప్పవారిని బలె దుస్తులొప్ప బచ్చె
కాండ్రు దేబెల వెనువెంట గ్రాలుచుండ
ననువుకత్తెలువరలుచోట్లను బొజుంగు
లరసి తిరుగాడి కోరినయట్టివాని
సంత నిప్పించి కులికించ జాలిరెలమి.

గీ॥ కనికరముగల్గి నాజూకుగల్గి చదువు
గల్గి విన్నాణమొకయింత గల్గి మంచి
చెడ్డలరసెడి తెల్వికొంచియముగల్గి
నట్టివాఁడొక్కడును కొల్వునందులేడు

గీ॥ అప్పు డుగ్రసేను డందరు చిన్న పె
ద్దలును బందుగులును బలసికొలువ
దుగ్గికడకువచ్చి తోరంపుబత్తిమై
నిండుజోత సల్పి నెయ్యమలర.

కం॥ తెచ్చినవనగలు నవ్వలువలు
మెచ్చుగొలుపు పూలచెండ్లు మేలగుపండ్లు॰
జెచ్చెరనిడి టెంకాయలు
విచ్చలవిడి బగులగొట్టి వేడ్కానినంత॰.

సీ॥ వెతజెందకుడుమీరు వేల్పువేల్పైనట్టి
కరివేల్పునకునెందు గలదెకీడు
వానిపైమోపిన వట్టితప్పునుమాపు
కొనవెంచిమానికంబునకుగాను
జాంబవుతోడ వింజవుసారంగములోన
ననిసేయుచున్నవా డతనిగొల్చి
రతనంబు నలజాంబవతి వన్నియలమిన్న
నతనిచేగొని మేల్మియరదమెక్కి

రాగలడుమీకు గనుపండువీగలందు
కొలదిరోజులలోనని కూర్మిమీర
నందరువినంగ మోవరుల నబ్రమును బ
సందుచిందులుదొలిక్రంగ సత్తిపలికె.

చ॥ గొరియల దున్న పోతులను గోళ్లను మేకల నాదు చెంగట॰
నరికినవారి మిర్రింగుటలు నాయమటంచును మిత్తినోటిగ

త్తరవిడిపించవచ్చునటిదంతు బుసింబడి మ్రొక్కుఁ రీతిగా
నారగెనుమేనులన్నిటిని యొక్కతలంపునజూచుటొప్పగుఁ

గీ॥ అంత గత్త్రినేస్త్రి యనుగు జట్టాలునె
చ్చెలులు నాండ్రు ననువుచేడియలును
తల్లిదండ్రు లన్నదమ్ములు గొడుకులు
మనుమలెల్ల దుగ్గి మాటనమ్మ.

కం॥ అదెవచ్చెనువెన్నుండని
యిదె వచ్చెను వెన్నుడంచు నింపుదొలంకఁ
జదురులతో బెరిమలతో
నెదవంతదొలంగియుండి రెదురుంగనుచుఁ.

కం॥ అట నట్టిల్లుందోర లో
దిటమంతయు దూలి తన్నెరిరితెలిసి కడుఁ
గటకటపడి యాతని బో
ల్చుట కెవరీడంచు బెదరుచూపులతోడఁ.

ఉ॥ ముక్కునవ్రేలుబెట్టుకొని మోమునవచ్చెరువూరిపొంగగా
బక్కవాలుమాయినెక్కు దొరసాలికి బత్తి దలిర్పనే గిదే
మ్రొక్కితిదప్పులోర్చికరముల్ బిరిమారగగావుమంచటఁ
జొక్కపుజోతసల్ప నెదజొక్కి యతండును లేవనెత్తినఁ.

గీ॥ తిరిగి తిరిగి నేలయొరగి పల్మరుమ్రొక్కి
తప్పు సైపుమనుచు దండమిడియె
తలప బంటుతప్పు దండంబుతోడ జె
ల్లానుగాదె యెట్టి మానిసులకు.

తెల్లఁగడుఁ మెచ్చి నిన్నాడరే యచ్చరల్ మెచ్చుగాన్పింపగా నాదరే యంత యిల్లాలితోఁగూడి సాకేతముంజేరి మమ్మం దరఁ రోజు కొక్కొక్కరీతిఁ నగల్బట్టలుఁ నోటి కింపైన బోనంబు వెట్టించి మన్నింపవే యెన్నియో యేండ్లు రారాజువై నేల గాపాడవే నీయనంబోలగాగల్గు వారెవ్వ రయ్యా జగం బెల్ల బుట్టించి పెట్టించి గిట్టించి లోన న్స్వాలింగల్గి వేడుంగొనఁ లేక యుండెందు గన్గొన్న సందింతయుం బోక యేనుంగులో చీమలో నొక్క రూపై వెలుంగొందు దీవేకదయ్యా ననుం గూర్మిం జూడంగ నేతెంచుటల్ గాని లేకున్న వాడేవ నీవేడ యూతప్పు మీమీద మోపెట్టుటల్ గాంచగా నబ్బురంబౌను గాదే నినుం బోల్పగా లేక నేనన్న యామైకపుం బల్కులఁ బాటిగా నెంచకయ్యా వడిఁ నీపయిఁ వేయు రాల్ జెట్లు నమ్ముల్ విరుల్ బత్త్రిరింబ్రాలువోలెఁ మదిఁ జూడ వయ్యా నినుఁ సుంతముందే కనుంగొన్న చో యెట్లు గారాబ ముఁ జేతునో యెంత కూర్మిఁ గనుంగొందునో యెంతగా బత్తిఁ జూపింతునో దానికిఁ మారుగా యిట్లు బల్ దెబ్బలం గొట్టితిం నేను జెన్నంటనైనఁ మదిం గల్లయుఁ నిక్కముఁ మంచియుఁ జెడ్డయుఁ గాంచగాలేవ నీవే తమిఁ బ్రోవవే రావవే నన్నెలుంగంచు కొంచెంబుగా జూచినఁ నాకు నీకంటె నింకొండు దిక్కెడి యంచాడినఁ నన్ను గొండాడినఁ వేడుకం బాడినఁ.

క॥ చిరునవ్వుగల మొగమును గని
కరమును సింగారమొల్కు గన్నులతో చ
గ్గర దీసి మై నివిరి య
క్కరిగొల్లడు వెరువకు మని గారవమెసగన్.

క॥ నీమదిగలబత్తి ననున్
బ్రేమను బొందించె వేయిమాటలికేలా
రాముడగువాడు జేసిన
నీమేల్మరువంగ నేనె నే నెన్నటికిన్.

క॥ ఈ మొద సల్పినకయ్యము
మా యెడలన్ వియ్యమయ్యె మదిగుందకు మో
హా యెలుగుతేడ కోరుము
నీయిచ్చలొసంగువాడను నిక్కంబిపుడే.

గీ॥ అనిన జాంబవంతు డంతింతయనరాని
సంతసంబు జెంది జాంబవతిని
దెచ్చి కానుకిచ్చె దేవేరిగా నా
పట్టి మేల్గొనాఁ పుట్టయనుచు.

క॥ ఇచ్చినకన్నియ చెల్వం
బచ్చెరువొసగింప నెమ్మి నతడుంగొనగా
నచ్చెర చుట్టల బెండ్లికి
విచ్చేయం జాంబవుండు పిల్వంబంచెన్.

గీ॥ కాంతురి కాంతురి మటంచును గట్టిటంచు
గురగుర మటంచు గీయంచు గోయటంచు

కీయటంచును జొట్టాలు నేయమున్న
హారువిచ్చేసిరా పెండ్లివారిగాంచ.

క॥ వచ్చిన చుట్టల కీతవుల
కిచ్చుఁ మఱియాదసల్పి యిచ్చినకానుకల్
బుచ్చుకొని సేమ మారసి
గ్రిచ్చుజ నందరికి విందుగావించు నెడఁ.

సీ॥ గొరియల మేకల యెరచి తిండికినంజు
లుప్పుకుం దేటిపిల్ల లొకవరుసకు
నాబోతునంజుడు కాముటేనుగు తల
నుండెడి మెదడుకూరొక్కబంతి
కొలమి గావించు ముస్తలబోనమును జొన్న
చెరకుపానక మొక్కదరిమగలకు
లేరావియాకు రాలినవెల్లపండ్లను
మొలవపచ్చికను యొక్క బలగమునకు

నాడెమగుపచ్చి మొక్కజొన్నలును బీత
లొక్క కొలముకు బుట్నాలు చక్కనైన
పండ్లు నొకబారువారి కవ్వారిగాగ
వడ్డనమొనర్చె బలిర వహ్వాయనంగ.

క॥ తనకొలపువారినందర
జనువునకూర్చుండబెట్టి జలజలయను బు
వ్వనుగూర్చి పుడకతేనియ
లనుదప్పిందీర్చి విడెములను దానిచ్చెఁ.

గీ|| అంతవింజంపుటడవిలో నమరుచుండు
తబిసితేండ్లెల్లవచ్చి యంతయును మెచ్చి
యెలుగుమన్నీ దుబత్తి మన్నింపనలరి
యింపుమీఱంగ బెండ్లిగావించు నెడల.

క|| పచ్చలతోరణఁగట్టిరి
హెచ్చైతగు పెండ్లిపీట లేర్పరచిరి పెం
బచ్చడములు దాల్పించిరి
యిచ్చిరికపురంపు విడెము లిడువురికి నగన్.

క|| అల్లుడనియడుగు దమ్ముల
నల్లనబట్టుకొని కడిగి యానీరుతలం
జల్లుకొనె నాతడీసుం
జెల్లెడలన్ గోర్కె సేయు నింతియ కాదే.

క|| కన్నియనుదానవోసెను
జెన్నటులం జెందునట్టి జెట్టికి జగముల్
మన్నించునందు పట్టికి
నెన్నంగా వాని పున్నె మేమనవచ్చున్.

క|| అత్తలిరుంబోడియు చెలి
ముత్తెంబులు దోయిలించి మొనసి మగనికిన్
నెత్తిపయినుంచె నతడును
బుత్తడిరతనాల తాళి బోలతికిగట్టెన్.

గీ|| ఇట్లు పెండిలిగావించి యింపుమీఱ
నాముటేన్గుల నడగల నరదములను

బసిడిసొమ్ములవేవవేల్వానిసెలను
చెరిమమైనిచ్చి యల్లుని, బిడ్డను గని.

ఉ॥ ఏమియెఱుంగదీముగుదయెంతయు గోలలగూడియాడెడిఁ
బ్రాయిమినవేశ్యనైన బనిపాటల నెన్నడుసేయలేదు నే
నేమఱిపాటునన్నిమపమెచ్చుట నిల్చిన బెంగజెందు నీ
వేమియుజూతొ గొబ్బివ్రతిని నీచెలికిఁ సరియెన్నిరీతులఁ.

ఉ॥ ఈమెలనాగప్పై సవతుల్లీరసమాడిన నల్లకయ్య చూ
చాయలుబల్కినఁ దెలియజాలని బేలగదయ్య పువ్వులఁ
గోయగగంది దానొరుపగుఁ గయిదోయియు దీనికద్దిరా
సోయగమెంచి విద్దెచట జూచి యొపంగగదయ్య మన్ననల్.

చం॥ అని తనకూతుతోడ వినుచున్మరొ నీమగ డల్లిపల్కినఁ
గినియకు మోక్కిమైబలికి కిన్కమరల్పుము గౌరవంబునుం
జనువుగలాడుగా నయినజాలినవట్టుకుమాటలాడుమెం
దునతనియిచ్చలఁ దెలిసితోరముగానమకూర్పుచున్నియుఁ.

కం॥ అత్తలమామల యానల
నెత్తిపయిఁ దాల్చిబత్తి నెరవేరుచువిూ
పెత్తనము గల్గువారలు
నెత్తెరివచ్చినను దెలిసి మెరగుము తల్లీ.

సీ॥ బంటుల దొత్తుల బంచజేరినవారి
బెరిమబిడ్డలబోలె నరయుమమ్మ
సీతోడికోడండ్రి నీసవతుల గూర్మి
తోడబుట్టువులట్లు జూడుమమ్మ

బావల మరదుల బంధులనొజ్జల
మరియాదతో జూచి మసలుమమ్మ
మగనితో సరివేల్పు మరియెందు లేదని
తిరముగా నెదలోన దెలియుమమ్మ

పుట్టినింటికి మఱియును మెట్టినింటికి
కీర్తి చెడుపేరు నెందు రాబట్టకమ్మ
చిట్టివై గట్టియసము జేపట్టుమమ్మ
యత్తవారింటి కేగి రావమ్మ అమ్మ.

చ॥ అనితనవిగ్రహుం గిరధరున్ని యు నేరిపి యుల్లునింటికిన్
బనుపు నెదన్ బొలంతి తెలివాలుకనుంగవ వెంటనీరుల
ల్గొని వశమై బిరాన జనుగొండలు దాటచనంగ నెల్లుతే
డుచు మది తాలిమి నాపి కడున్ వగపుంగొని కంటనీరిడన్.

కం॥ అడవులనుండెడి మొగమును
గడుపున గనుకూతు నత్తగారింటికి బం
పెడు నెడల గనుల నీరిడ
బుడమింగల గేస్తు లడలు బొందుట లరుదే.

మ॥ చెలులున్ జుట్టలుదోడబుట్టువులు నా చెంగల్వపూబంతి కిం
తుల మేల్బంతికి సొమ్ములున్ వలువలున్ దోరంబుగా నిచ్చిలో
గలకం దీరిచి తేరుమీద కపుడెక్కించ జేయగా వెన్ను డ
వ్వలదిన్ దోడ్కొని ద్వారకావతికి దా వేంచేసెను పొంగుచున్

ఉ॥ ముప్పది రెండు చప్పుడులు భోరున గ్రీవ జెలంగగా నాగిన్
గుప్పలుగాగ నేనుగులు గుఱ్ఱములున్ బనివాండ్రు వెంటరా

మెప్పులుగుల్క దారుకుడు మెల్లన దేరును దోలుచుండగా
నప్పుడు జూచ్చి పౌరిలు తనయాలు మదిన్ బళిమేలుమేలనన్

కం॥ వచ్చినవెన్నునిపై పై
ముచ్చటలూరంగ పౌరిలిముద్దియలెల్లన్
విచ్చలవిడి విరిజడు ల
య్యచ్చగలో యనగ గురిసి రబ్బురమెసగన్.

గీ॥ చచ్చిమరల బ్రితికి వచ్చినట్లగురీతి
బెండ్లియాడి వచ్చుపెంపుసొంపు
నిన్నినాళ్లనుండి యెడబాపు చేరిచేచ
జూచిరతని వీటిజోటులెల్ల.

చ॥ వెలదుకగూడి కృష్ణుడటు వేడుకమీరగ వచ్చుచుండగా
కలికియొకర్తు కొంబసిడి కంచెల జక్కగదాల్చి తత్తరం
బలవడ వాకిటన్నిలిచి యాతనియందము జూడబోంగ న
క్కలువలకంటిమేను చసుకట్టు వటుక్కున వీరిలె నత్తరిన్.

ఉ॥ అన్నెరనీటుకాని గనునాస నొకర్తుక కేల కిల్జషన్
బన్నుగదాల్చి నిల్చి యిదె పాము ను బట్టితినిన్నురప్ప నే
నెన్నడునొండ్లజూచుటకునిచ్చ యొనర్పనుజూడుమయ్య యో
వెన్నుడ! యంచు దెల్పనటు వేగిరపాటున నింటిమోసలన్.

ఉ॥ పోరణగండ్ల రాకొలపు జోటులుగిరిక్కిరియంగనిల్చి క
న్నారగవానిచెల్వు గనునప్పుడొకర్తుకకర్జ మున్నటుల్
జేరగబిల్చియయ్యెడకు చెచ్చెరదోయి యొకర్తు జూచె వ
హ్వారెయటంచు దోడిచెలులందరు దన్నెగతాళిసల్పగన్.

చం॥ పొలతుక లెల్లజూడ విరిబోడి యొకర్తుక తానువచ్చి చె
ల్వ్యాలగనిద్రయైనవాని చెలువుం గనుపండువుగాగ జూచి లో
నలరి నెలంతలందరిటు లంకిరిసంతస మంచు నీరసం
బలవడజూచె జాంబవతి కారయగా నెటులుండెనో మదిన్.

చం॥ బుడుతను చంకనుంచుకొనిపాల్బుగనోస్త్రకసానిసోయగం
బుడుగకచూడజూడ జెయువుల్ డిగిపోయి పడంకుపుట్ట న
బ్బుడుతడు జారికింకబడిపోయిన నింత రయెబుంగబోదు వె
న్నుడచటువాసిపోయినగనుంగొని యెన్నిసు వేడ్చుచుండుటల్

మ॥ వలతీవల్ కిటికీలు సందు లనువౌ వాకిళ్లు సావళ్లు గొం
దులు తల్పోరలు దిడ్డికంతలును వెన్నుం గాంచగానుంచు మో
ములతో గన్నులతో డనిండి యవిసాంపుం జెందె నెత్తమ్మి పూ
వులతో జేపలతో జెలంగు పడియల్ పోరెన్ గనుంబండువై.

గీ॥ తమ్మికంటియంత దినవాడకరుదెంచ
తల్లి,తండ్రి, తండ్రితండ్రి యన్న
దమ్ములుంగొడుకులు నెమ్మిమైనదురేగు
దెంచి కాంచి కౌగిలించి మించి.

క॥ మొక్కుబడి మొక్కులంగొని
పెక్కువితంబులను చిన్నపెద్ద లతనిపై
మక్కువలు గురిసియుంటికి
గ్రక్కువగొనిపోవ నూడిగవుబోంట్లంతన్.

గీ॥ మేల్మిముక్కాలిపీట లమ్మెట్టికెక్క
లందికిన్ దెచ్చివైచి తసందుమీర

వలపుపస్నిట నడుగుల పసిడిపళ్లె
రముల నిడి కడ్డి తడి వలిపెములనొత్తి.

సీ|| గిలుకుబంగారు పట్టుపావలను దెచ్చి
తొడుగగాజేసి యాజంపతులనులోని
నగరుజేర్చిన నచ్చోటిమగువలెల్ల
నతనిగనిపొంగి కపురంపుటారతిచ్చి.

సీ|| అయిదుపదకములయోగిరా లప్పుడింపు
నింపగాబెట్టి మేలికపళ్ళింపు విడెము
లిచ్చిసంతోసమున బవళించువెనుక
నడుగులొత్తుచు నడిగిరాగొడవలెల్ల.

సీ|| అచటజరిగినకతలెల్ల నన్నువలకు
దెలియగాజెప్పి సంతోస మలవరించి
జాంబవతిసెజ్జనారేయి జరిపెనొక్క-
చిటికెసేపట్ల కొంబొత్తి చెలిమియట్ల.

ఉ|| అని శౌనకుండు మొదలై
తనరు నిరాభారులకు గతల్ సెప్పిడియా
వెనుపోడదెల్ప నావల
వినవలతుము చెప్పుమంచు వేదుకొనుటయున్.

క|| మన్నుందింటివిరా ని
న్నున్నేగొట్టెదను తెరువు నోరనియన లో
నున్న జగంబులు తల్లికి
గన్నన జూపించు శేర్పుగల్గిన వలతీ.

ఉ॥ వీనుఁ నిక్కవట్టి యడవిన్ మొదవు ల్వినుచుండ గొల్లత
ల్మేనులు సైతము న్మఱచి లెస్సఁగనున్గాన నెందుమోదు లే
పా సనకారుకందుబలె నన్నవమొగ్గిష బిల్లగ్రోవిచే
బూని జగంబుఁ న్ని వలపుల్ గొనబాడిన గట్టినేర్పరీ.

తోటకవృత్తము.

అల రక్కసిఱేడుఁ గందరికిన్
జలముంచక సిచ్చట జాఁసుకం
బులుకూరిచి యావల బున్నెపుచో
టలవర్చిన మేటరివైనదొరా!

క॥ గొనముల కిమ్మగు జంగా
హానుమయ గావించినట్టి యచ్చతెనుగునం
గొనబైన సత్కృపెంపిన్
దనరెడి తగగుర్కియుడి యనం బోలుపారున్.





# చతుర్థాశ్వాసము

క॥ సుడివాలుఁ వలమురియుఁ
గుడియెడమల ధాల్చువాడ కూళలనూడా
పుడమియు సిరిగలత్రేడా
కడుసాధుల గనికరమున గాంచెడుపోఁడా.

గీ॥ చిత్తగింపుము జడదార్ల మొత్తమునకు
సూతుడిట్లని చెప్పె దర్వాతికతను
వెన్నుడటబవ్వళించిన వేకువతరి
మేలుకొల్పుల వార లమ్మెడజేరి.

మ॥ నినుగన్నారగగాంచి మ్రొక్కులిడి యెంతే దెచ్చియున్నట్టి క్రొ
న్నన నెత్తావులనప్పగించుటకు నున్నాడిందు నీసన్నచ
ల్లనిగాలిఁ మరియాదజేయదగుజాలఁ బత్తిమైచేరి వే
డినవారిఁ గనిసాకుటల్ దగవుతండ్రీ మేలుకొమ్మా దొరా.

ఉ॥ కొక్కొరకోయటంచుదొలికోడియు రెండవకోడిగూసెబెన్
జొక్కయుజుట్టపక్కములజూడననన్ మినుబ్రాకెనెంతయున్
జక్కగదూరుపఁ జెలియ సబ్బున మైజికలీ యొనర్ప గెం
పెక్కెడు కావికల్వలపయిఁ దమయేత్తరజూపుచేతులఁ
మక్కువవేవెలుంగుపలుమారునుజాచెడుజూడుమయ్యరో.

మ॥ అలసత్రాజితుఁడించుకేనియును నాయంబెంచకే నీపదోం
గిలినావంచు దొడంగి చెప్పపినమాకే సిగ్గుచిట్టాడగా
తలవంపుల్ సమకూరెనచ్చెనటఁపంకఁ మానికంబిచ్చి యా
వలనెంతే దెగనాడగావలయు నప్పా లేవిరారా దొరా.

చం॥ అనియిటు మేలిపాటలను నాతని మేల్కొలుపంగ, లేచిచ
య్యన తరిచెయ్యవలఁ సలిపిహాసు జెలంగగ గొల్వులోనికిం
జని తన పోౖలిపెద్దలను జాలినవారల బిల్వబంచి ని
ఘ్నునితోలుచూలుదిల్పి చెకొమ్మవిమానికమిచ్చి వెండియుఁ

క॥ తనకది దొరినచందం
బును జాంబవ్రతోడి గయ్యముఁ జాంబవతిఁ
గొనితెచ్చుట వినుపించిన
విని సత్రాజిత్తుమోము వెలవెలబారెఁ.

క॥ ఎల్లగ మనిచెమదొర ని
ట్లల్లరి పతగానానచ్చెనకటా యిక నీ
కల్లరి మోముఁ జూపఁ
జెల్లదు పోయనిరి యచటి చిన్నలు బెద్దల్.

క॥ తగడిని సత్రాజిత్తున
కగు దోసంబనుచు నొవ్వనాడనివారల్
మగటిమియుఁ గొనముల నొ
ప్పగు వెన్నుని కననివార లచటఁగలరే.

సీ॥ ఎరుగక నిన్ను దబ్బకలాడినాడ నా
నేరంబులన్ని మన్నింపపయ్య

నిన్నొక్కడిట్టగా నెన్నితిగాని ము
న్నింతవాడవటంచు నెరుగనయ్య
నాయంత నేనె చెన్నటినంచు జీకొట్టు
కొనజేసితి బొగడ్త గొంటివయ్య
తరమెవ్వరికిగాని నెరకర్జ మొనరించి
మానికంబిచ్చి నన్మనిపితయ్య

నేను నీకేమి బదులీయ నేర్తునయ్య
నాయనుగు ముద్దుకూతు జన్నారినీయ
మదిగలిగె దాని గైకొని మనుపవయ్య
అల్లుడవు గాగదయ్య యోన్నలనయ్య.

క॥ అని యదుకుల వార్లిన తే
విని గని కనికరము మిగుల నెమ్మదలిర్పం
గను లేవనెత్తి పారపా
ట్మైనయున్ బెద్దలకుగూడ నెందే నొకచోన్.

గీ॥ డబ్బువోవువాడు దెబ్బలుబడువాడు
నోరు నచటనచట బారవైచు
దెలివిగల్గువాడు దెంపుగల్గినవాడు
నొదిగియుండి కర్జమొప్పజేయు.

చం॥ వెరచియొసంగదొక్కకడు వేడ్కనొసంగదొసీయనుంగు
గూతురునిది చెప్పుమయ్య వెరతోడనొసంగదవేనిమానుమే
వెరపును లేదునావలన వేడ్కనొసంగదవేనినిమ్ము సం
బరమున బెండ్లియాడి చెలిబట్టపురాణుల మిన్న జేసెదన్.

క॥ అనవుడు సత్రాజిత్తుం
డెనగానని సంతసమున నినుమడియై నీ
గొనములు సొబగునకుఁ బెం
పొనగూర్చెడి నీకుసాటి యొరుఁడొకడున్నే.

క॥ నాకన్నియకుఁ దగు దీ
వాకన్నియ నీక చెల్లు నాకసిచూపఁ
నాకోలము వన్నె కెక్కఁ
నీకన్నఁ మంచియల్లునిఁ జేగలనే.

మ॥ నినుగొండాడినయుబ్బు నీగొనము లెంతే వెచ్చు నీసోయగం
బునుబల్ రంగుల వ్రాయునెచ్చెలుల తప్పల్ దిద్దికన్నారగాం
చును మై చెమ్మట గ్రమ్మగా గయిత గూర్పుఁ నీకనల్ వేమఁ
నినుబాడుఁ గదనాదుపట్టిగడు తేనెల్ జల్కుఁ జంత్రింబుఁ.

క॥ కావున నీకుఁ గూర్చెద
నాపటనఁ గన్నె తప్పునానఁ నాకై
నేవడసిలి మన్నింపుము
దేవేరిఁ జేసికొనగదే నాకూతుఁ.

చ॥ అనవుడు గృష్ణుఁడియ్యకొనె నౌనని రంపరు బందుగుల్ సెబా
సనిరి యనుంగు నేస్తుఁ హాహాయని పల్కిరి తోడివారలిం
తనియనరాని సంతసమునందిరి పిన్నలు పెద్దలెల్ల వ
ల్దనిరియొడు వారలుం గలరె యన్నుఁ మిన్న తనంతయబ్బినఁ.

క॥ అత్తరి బెద్దలయానతి
జిత్తరువులు వ్రాయువారు జిన్నెలు వన్నెల్

క్రొత్తగ దీర్చెడివారల
మొత్తము లూరెల్ల గలయ మూగినయంత౯.

సీ॥ ఏపరిక్క జూచిన నిసుమంత యెడలేక
పెండ్లికి పందిళ్లు బెట్టువారు
నెచ్చోట బొడగన్న హెచ్చు ముచ్చటలూర
పలురంగు లెలమిమై బ్రాయువారు
నేయింట జూచిన నింపుగ వాకిండ్ల
దీరుగ చిత్తర్వు దీర్చువారు
నేవాడ నెంచిన జేజారు గోడల
నిలువుటద్దంబుల నిల్పువారు

నెందు గనుగొన్న రవ్వంత సందులేక
తీరు తీరు చెడంగులు గూరువారు
గలుగు నాపౌరులు గనువారి తలపు కెక్క
జెలువముల కెల్ల బుట్టిన నెలవనంగ

సీ॥ పండువెన్నెలకు ముబ్బడిమై చెలంగి య
చ్చెరువులూరించెడి మెరుపుదివ్వె
లెనలేని యెలమావి గొనబుటాకుల తీరు
బాటించు పువ్వుల పల్లకీలు
నన్నియో రీతుల నెలమిగూర్చెడి తళ్కు
సోగచిత్తరువుల తీగపనులు
వేయు రేకులతమ్మి వేడబం బడగించ
జాలు సొగసైన ముత్యాలముగ్గు

లమరు వాకిండ్ల ననటికంబములు వలపు
మించు గందంపు పన్నీటి సాంచమేలి
పచ్చరా తోరణాలతో మెచ్చులొలుక
వీడు కనుపండువై యొప్పె వెల్పులకను.

గీ॥ వేయి కన్నుల దనివార వేల్పురాయ
డప్పుడావీటి సొగసెల్ల నమరజూచి
వగ్గు జడదారి తిట్టు దీవనయనాక
టించు మదినుబ్బితబ్బిబ్బునందసాగె.

క॥ అత్తరిలోపల సత్రా
జిత్తు నెలవు నందు బెండ్లిజేసెదు తమి నా
యత్తపరిపించె బలువురు
పెత్తనగాండ్రను గడించి పేర్మి జెలంగన్.

క॥ బూరలు బాకలు ఢోళ్లను
హోరనుతాషాలు మరప లొప్పగుక్రొవుల్
వీరణములు రెసహాత్తుల
నూరక చెవుడందజేసె నొక్కుమ్మడిగన్.

క॥ చిత్తరువు పెండ్లిపీటలు
బుత్తడియరుగులు సమర్చి పూవ్రంబోడుల్
ముత్తియముల ముగ్గులనిడి
రత్తరిపెండ్లికొడుకిల్ హొయల్ పరిచి వేసన్.

సీ॥ కైదమ్మిదోయి బంగారుగాజులు మేల్మి
కడియంబులును గల్లుగల్లుమనగ

నిద్దంపు జెక్కుల నీటుగా మగరాల
జెలగు కమ్మలు తళతళయనంగ
చిరుచెమ్మటకు సుంతగరగు కస్తురిబొట్టు
కమ్మతావులు గమగమయనంగ
మెడలోన వ్రేలాడు మేలిచందురుసోగు
సొగసు లట్టిటు జిగజిగయనంగ

గబ్బిగుబ్బలు తమలోన కయ్యమాడ
నడుమువడకాడ చూడఁగ్రొమ్ముడిసాము వీడ
వలపులేచగాడ వెన్నుని కెలమితోడ
చానయొకర్తుక సంపంగినూనెయంటె.

చ॥ చల్లనిపిల్లతెమ్మరకు జారుపయంటను జక్కనొత్తుచుఁ
మెల్లన నల్లుబిండిగొని మేనవలంది కడుఁ రువారమై
చెల్లుచు గ్రొంజివ్వుళ్ళనెవజెప్పగరానటువంటి చేతులఁ
బెల్లగుకూర్మిమై నలుగుబెట్టె నొకర్తుక యత్తరిఁ దగఁ.

మ॥ జిలుగుంబయ్యెదకొంగుజెక్కుకొని హెుంజెంబూనిచందో
యిచిక్కులలోనుండియు నిక్కుజక్కువల టెక్కుంజూపగా
నూర్పుతావులుగమ్మం చట గ్రమ్మగా మిగుల నొప్పుల్
గుల్కగా నొక్కయుగ్మలిసీరందిశలఁ దిగఁ విడిచె వేడ్కన్
గొల్లరాపట్టికిఁ.

ఉ॥ కమ్మనియూర్పుగాడ్పులసెగల్మెయిసోకగవింతముంగురుల్
నెమ్మొగమందుగ్రమ్మకొనినీటునుజూపకడిందికోర్కెడెం
దమ్మునసంకడింప బలుతావుల నిగ్గగుసున్నిపిండితో
గొమ్మయొకర్తు వానితలకుంగల నూనియ వాపె నత్తరిఁ.

సీ॥ చెలిమిన్న యొక్కర్తు జలుగుదువ్వలువాచే
దడియొత్తె నొకతె దోయి తళుకులొత్త
పసితయొక్తుక పీపునైగుబ్బలదిమిచి
క్కడలించి ముచ్చటముడిని వేసె
కలికి వేరొకతె చుక్కలు తళుక్కులూన బల
పసగరా పొగుల సొగసు పరచె
మొగిముసిగ్గులు వియ్యమును బొంద తీర్చైన
నామమ్ము దీర్చె నాతి యొకతె

యొక్కరితె చూపుకోపుం సువాసించి
నేర్మిగనాఁట పేసలు మెడను గూర్చె
బంగిరువు పట్టుపంచ గట్టంగనిచ్చె
నొక్కరిత నల్లసామికి నుల్లమలర.

గీ॥ అప్పుడాతని యబ్బురంబైనరూపు
గాంచి తమిజెందికుందని కలువకంటి
అట్టి యాతని కౌగిలి కాసపడని
యింతి లేదట గల్గుపొలంతులందు.

క॥ అక్కడ సత్రాజిత్తుని
చక్కని గీమునను జెలిమిసకియలు సత్యన్
గ్రక్కున వెచ్చనినీటన్
జొక్కంబుగ జలకమార్చి సొబగుజెలంగన్.

ఉ॥ ఎమ్మెలుమీరు సొమ్ముల బళీయనగా కయిసేసి బొట్టునై
నమ్ముగదీర్చి సొక్కనుఘుమంఘుమలౌపుల జిల్గుకంచెల

ముమ్మరమైన లేతచనుమొగ్గలపై గదియించి క్రొంబసల్
జిమ్మెడి పట్టుచీర మెయిచెల్వు మెసంగగ గట్టిరంతటన్.

మ॥ హరువౌ మేళములన్నియున్ జెలఁగగా నచ్చెరువ్వలూరించుచూ
పరులౌరౌక్క పుటంద్రుడెందములునీక్షరై చూచువారెల్లదాం
దరపాటొందగ, నాడ రాకొలవు పెద్దల్ మేలి పూపల్లకిన్
మురువొప్పారగ వెన్నునుంచుకొనిసొంపుల్ గుల్కగా నేగుచున్.

క॥ చని యాసత్రాజిత్తుని
గొనబుంగీమునను పెండ్లికొమరుని గడుచ
క్కని బంగరుచిత్తరువుం
బనిగల యొక పెండ్లిపీటపై నుంచివెసన్.

గీ॥ చెలిమికత్తియ కన్నియ చేయిపట్టి
తీసికొనివచ్చుతరి జల్లు దెరనుబట్టి
పీటపై చెలి గూర్చుండబెట్టి విలువ
గలుగు బట్టలు వారికి గట్టనిచ్చి.

సీ॥ చెన్నారు చెంబుతో పన్నీరు దెప్పించి
అపరంజి తాంబాళ మచటనునిచి
మేటనిరాబార్ల కూటువలకునైన
నెన్న కేనియు జిక్కి యెరుగనట్టి
వెన్నునియడుగుల వేడ్కతో నందిడి
పెరిమనుగడిగి యబ్బురపుముద్దు
కూతు నతనికిచ్చి కొమరారులగనాన
పాలిబల్కులందున బరగుతగవు

వెంటబెండ్లిసల్పి వెన్నునిచేత న
గ్గరిత మెడను తాళిగట్టజేసి
రపుడు బుదులుపెద్దలలర సేసలుబూని
సరగ వాఇవ...ని జల్లిరంత.

కం॥ తెలిముత్తెవుతలబ్రాల■
గలికి మెరుగువారు కేలుగవగూరిచినే
ర్పలరారగ బోసెను క్రొ‍ం
పలికులవిల్కానియయ్యాతలపై నాయ్య■.

కం॥ జగములనన్నిటి మనిచెడు
సొగసు■ గేల్బోయి పెంపు సొంపెసగార■
మగరాలుగూర్చిపోసె■
ముగుదల తలమానికమగు ముద్దియతలపై.

గీ॥ కరకుమగరాలవట్టిల యొనపిడి కిక
దాళుదో లేదొ చూడగా నగునటంచు
మన్ననగుసన్నికలు మీనకనన్నువడగు
నుంచి కృష్ణునికాల దాక్రొంచిరెలమి.

సీ॥ అపుడు వారిరువు రెచ్చొప్పీటలను గూరు
చుండి యుల్లములందునిండుబత్తి
తోగోర్కెలిగురొత్త దొట్టిపాటులెసంగ
నగ్గికపుల్ గొల్పియందునేయి
యుంచివేల్మిచేసియించిరప్పుడు నేల
వేల్పుముత్తైదువల్ వేడుకలర

గేల నారతి బట్టి మేలిపాటలుబాడి
రెలమి కోయిల లాలకింపుచుండ

నంత పున్నెంపు టన్నువ లౌదలలను
సేసలిడి దీవనల నీయ చెలగి పెండ్లి
కొమరుడును కల్కియును గూడికొలపు బెద్ద
లందరికి మ్రొక్కి మెప్పులనంది రెసగ.

సీ॥ అంతసాత్రాజిత్తు డలరిచుట్టలకు నె
య్యులకును బీదసాదలకు హెచ్చు
గను మేళగాండ్రకు బనిసేయువారల
కనువుగాబోన మింపార బెట్టి
పలురకంబుల పిండివంటల మదులుబ్బ
నటు సేసి కోరికలడిగిసెలవు
బెట్టి విలువ లేని పట్టుబట్టలగట్ట
బెట్టి సంతసమున వీడుకొల్పి

అల్లునికి దనకూతురి కైదురోజు
లింటనిడుకొని పెరిమెమన్నించిమించు
డెంచమునకూర్మి జాల్వారకుందనంపు
టందలంబులు చెలువైన యరదములును.

ఉ॥ మేలిహాలుమాయిముత్తెములు మెండగునేనికరాచగున్నలు
వాలుకనుంగవల్ మెరుగువారుమిటారపు గబ్బిగుబ్బలు
గ్రాలెడుమంచియూడిగపుకత్తియలు రతనాలసొమ్ములు
చాలుపుపట్టుపుట్టములు చందుకపెట్టెలు నిల్వుటద్దముల్.

చ॥ తలగడదిండ్లుదుప్పటులుదాపుడుకోకలుకొమ్ముదువ్వెనల్
కలపపుగిన్నెయల్ పసిడికాగులు బొమ్మలుపట్టెమంచముల్
చిలుకలపంజరంబులును చిత్తరువ్రాప్పెడి పళ్లెరంబులున్
గులికెడు కూర్మియల్లునికిగూతునకుందగనిచ్చిపంపుచోన్

చ॥ తనయనుగుంగుమారితనుతద్దయుగన్గొని పల్కెనమ్మరో
గోనములపుట్టవై మగనికోరికలం దనివారదీర్చుచున్
బనుపడతోడి నెచ్చెలులపై నినుమంతయుగిన్కజూపకే
చనువున బీదసాదలను సాకుమునీదగుబిడ్డలంబలెన్.

సీ॥ మామల నత్తల మఱదుల బావల
నాదుబిడ్డలగూర్మి నరయుమమ్మ
చేరినీదరినుండు చెలిమినెలంతల
తోడబుట్టువులట్లు జూడుమమ్మ
మగనియానతిమీఱి మఱియాదబోనాడి
పొరుగిండ్ల కెన్నడు బోవకమ్మ
పెద్దలేరైనను జేరిమనింటికి వచ్చి
రేనిపెంబత్తిబూజించుమమ్మ

చెనటి పోలతులతో జెల్మి సేయకమ్మ
ఆటలందేని కల్లల నాడకమ్మ
పుట్టినింటికి మఱియును మెట్టినింటి
కెంతయు యశమ్ముగూర్పగా నెంచుమమ్మ.

క॥ అనియిట్లు ముద్దుపట్టికి
ననువగుకరదలను గరపియల్లునికేలన్

గానబారుకూతు చేయిడి
యనియెఁ గన్నీరు నించి యడకువతోడఁ.

సీ॥ పూవులం జిదుముచు బూదోటనడచిన
గేఁజ్జలును గంది కెంపుఁజెందు
పాలుపుందనముగల్గు పూబోడినెమ్మోము
లేయెండలకునైన వాయిదరుగు
చిన్నారిపొన్నారిచెలువవీనుందోయి
నెమిలికూతలు విననేరకులుకు
సుదతివాల్గన్నులు సోయగంబులుగాని
యుదుటురూపుల జూచి బెదరుజెందు

నెట్లు నడిపింతొ తినిపింతొ యితవు లెరిగి
బెదరు నుల్కనుమాన్పగా నెదియొ తెరవు
యింతి కడుముద్దరాలు సేవంతిబంతి
యిచ్చల నెరింగి దీనివన్నింపుమయ్య.

గీ॥ అని సెలవుబెట్టినంత నయ్యందకాడు
కుందనపుగిల్కు మేల్పావుకోళ్ళమీద
జని చెలియగూడి తేరెక్కె చామతోడ
నెగడురేరేడు తొలికొండ కెగసినట్లు.

సీ॥ కరిమేనిబలుచాయ కారుమబ్బులుగాగ
మెలతుకమెయినిగ్గు మెరుపుగాగ
నరదంపుచెంపుసోయగ మాకసముగాగ
పువ్వులు తెలిసీటి బొట్లుగాగ

రో నెలంతలపాట వానచప్పుడుగాఁగ
నాటయంతయు నెమ్మి యాటగాఁగ
కూర్చిన పచ్చనాకులు సింగిణులుగాఁగ
పడిపోవు రతనముల్ పిడుగులుగను

మొరయువాయిద్యముల చప్పు డురుములుగను
మెరుగురతనాల దివ్వెలు మిణుఁగురులుగ
నట్టి గనుపట్టె తొలకరి యనఁగఁ బోలి
వారి పయనంబు సంతోసపరిచె జగము.

గీ॥ అన్ని రకముల మేళంబు లదరి మ్రోయ
బట్టుకొండాడ రొక్కంపుబసతులాఁగ
బంట్లు హెచ్చరికల బరాబరుల్ గానర్ప
కృష్ణుఁ డల ద్వారకావతి నేగుచుండ.

గీ॥ మేడలకు నేగి గోడలమీఁద నెక్కి
గొప్పయిద్దెలపయి నిల్చి గురుజులెక్కి
యరుగులను ద్రొక్కి వీధియలందు నక్కి
చూచుచుండిరి వారలసోయగములు.

మ॥ తెలిముత్తెంబులు చేతులందు నిచియుం దేకూర్మి దైవారఁ గ్రొం
దళుకుల్ హెచ్చు బొమ్మలైన కన్నెలనుపందల్ జల్లిరా
నీవు పెండిలియాడేని చెలంగి నీపయి నిన్నిట్ల సేసబ్రాల్ జల్లగా
వలెనన్ గోరిక గల్గియున్నదని తెల్పంబోలు నంచెంచఁగన్.

సీ॥ అపుడు మెరుగుదివ్వియలవెల్గుచే జగ
మెల్లను తెల్లనై యింపునింప

మేడలన్నియు వెండిమేడలై కనుపట్టె
గోడలన్నియు కంచుగోడలయ్యె
చెట్టులన్నియు సిరిచెట్టులై పొలుపొందె
పొలతులెల్లరు నప్సరపొలతులైరి
మోములన్నియు చంద్రమామలై కాన్పించె
హొత్తులన్నియుతూర్పు హొత్తులయ్యె

నెల్లబూవులు మల్లెలు మొల్లలయ్యె
దిట్టలన్నియు గప్రింపుగుట్టలయ్యె
గుట్టలన్నియు జాబిలి చట్టులయ్యె
నంతవెన్నుండు వెలలేనిసంతసమున.

గీ॥ కలయ నూరేగి తనయింటికడకువచ్చి
తేరు డిగి కల్కితోగూడి తివిరి నగరు
జేరి పిన్నలపెద్దల జెలులబంధు
గులను దగురీతిమన్నించి సెలవొసంగి.

సీ॥ రతనాలదివిటీలు రంగారు పూచెండ్లు
కీలుజంత్రీలు నద్దాలు మేటి
పన్నీటిగిండులు పటికంపుబొమ్మలు
విరిసురటీలు న త్తరుపుబుడ్డు
గప్రింపుగొట్టాలు గస్తూరి డబ్బిలు
మల్లెదండలు జాజిమొల్లవిరులు
తీరుతీరుగదీర్చి తీర్చికై సేసిన
మేలిజాబిల్లి రామేడయందు

కనులుమిరుమిట్లుగొలుపు నక్కజపుగోళ్ళ
నలరుపెఱ్ఱెంబట్టె మంచమునందు నంచ
పక్కిరెక్కలదూది పెంపెక్కుసెజ్జ
నొక్కరేయిని జగజెట్టి యున్నయంత.

[మ్మ్రలు

చ॥ సకియలు ముద్దుగుమ్మయగు సత్యను మేలిమిపైను న్నసా
రకమగు చీరకైక టెఱరన్ బువుకండలగమ్మకస్తురిన్
జకచకలాడు మెర్పుచలె చక్కలిలింగయి సేసికేలు సిం
చుకగొని తెచ్చినిల్పిరట సోకులెగొంగ చెలంగుగిమునన్.

చ॥ నిలిపి నెలంతలందరును నేర్పున సాకులుచెప్పి పీడి యా
వలికిజనంగ మోమునపసంచి పొలంతుకబీతుసిగ్గు దో
ట్రిల నటకంబవున్ వరుపురివ్వన జొచ్చినయంత వెన్ను డ
వ్వోలది గవుంగిటంబొగివి వేడుకసెజ్జకుదార్చు నత్తరిన్.

సీ॥ తమకంబు రేచి ముంపరికేగు వ.నినెట్ట
నాగుమీయంచు సిగ్గాన వెట్ట
ననుగు నెచ్చెలులు వెట్టినయాన లుబికించ
చెంగ రెండంతలు పొంగడంచ
కోరికల్ తమిచెమ్మసిరిక లెత్తంగ
వేడియూర్పుల నవి వాడికుందంగ
వెన్నుని వేడికోల్ వేడుకలూరించ
ముద్దరాలితనంబు మురువుడించ
చిరునగవుతోడ నొక్కింత జరుగు జరిగి
మించు తత్తరపాటున గుంచు గుంచి

సై పుటెట్లని మరికొంత సాగు సాగి
భీతుసిగ్గునుగొని బిట్టు పెనగులాడు.

గీ॥ పొలతి నాప్రోడ యెంతయు బుజ్జగించి
తనయెదంగల రతనమందున దనర్చు
యింతిరూపును జూపి నెలంత యదిగొ
చెలిమికత్తియయని బోటిసెజ్జ జేర్చె.

సీ॥ చెవిలోన గుసగుసల్ చెప్పినట్టుగబోయి
నిద్దంపు జెక్కిలి ముద్దుబెట్టి
కరిసోగు ముడతలు సరిదీయునట్టుగా
చెలియ పయ్యెటకొంత చేతద్రోయు
ముత్తెంపునత్తు నేమో చూచినట్టు మో
మున మోముజేర్చి కెమ్మోవి జెనకు
మబ్బునల్లిన మించుమాడ్కిగా నుండువో
లేదా కన్మని కౌగిలించు మించి

యింత సన్నని నడుము నీకెట్టులబ్బె
ననుచు బిడికిట బుడికి ముడిని వదల్చి
బిడియమును సిగ్గు నొక్కింత సడలజేసి
ముద్దరాలిని మరుకయ్యమునకు దార్చె.

గీ॥ తురుముముడివీ్రల జెరివిన విరులురాల
చిరుచెమటలూర పేరులు చిక్కువార
బొట్టు చెదరంగ బెట్టును గుట్టడంగ
కన్నె వెన్నునితో మరుకలనదోరె.

గీ॥ అటుల బోరి సాక్షి నట్టి వారలజూచి
గాలివేలు నెవరి కంటబడక
సరగనేగి చలువ చలువ వండులు దెచ్చి
యొసలులందు బూయనాయ్యలేచి.

క॥ తరిచెయ్యువెల్లదీరిచి
కరివేలుపురోలుపు జేరి కలచుట్టములన్
నెరకాంక్షిబుదులు బెద్దల
చెరివను గడుగారవమున విలిపించి వెసన్.

క॥ ఏరీతి నెవరు మెచ్చుగా
యారీతిగ వారి మెప్పునందించె వహా
వ్వాదే బలియని పొగడుచు
ద్వారావలినుండి చనిరి తమ నెలవులకున్.

గీ॥ అంత వెన్నుండు సత్యతో నైనయట్టి
రాణులెనమండ్రు దన్ను గౌరవము సేయ
నవల నచ్చరలం బదియారు వేల
గూడి యాడె నెవతెయందు జోడువిడక.

సీ॥ ఏయేగరితమున్న కేమే కొరతలున్న
నెరిగి వారల యిచ్చలెల్ల దీర్చు
నేసాదుదుండగీండ్రిచట గాదించిన
వెంటనే జని వాండ్రపీచమడచు
నెవ్వ రేకోర్కెల నిశ్రమ్మని వేడిన
వారికోర్కెలొసంగి వచ్చుచుండు

నేకాలంబున బుట్టి యెటుబత్తి సల్పిన
గాఢముపై వారి గనికరించు
నడిగినది యిచ్చు నెపుడు లేదనుట లేదు
సరియుతనిచూడ్కులకు నల్ప సన్నచీమ
యిట్టిదొర జగములయందు నెందుగలడె
యనగ జెన్నొందు బుడమి నాయంగకాడు.

క॥ ఈకత వ్రాసిన జదివిన
జేకొని వినినట్టివారి జెందును సిరియున్
వీకయు సుకమును ముత్తియు
నాకొను తటుసుటకు నీగియాత్పుంబోలెన్.

క॥ అని తెలుప సత్యపెండ్లిన్
విని తనివిం బొంది తడిసి పేవెల్గులు సూ
తుని బొగిడికొనుచు వడి వె
న్ననికత లగ్గించికొనుచునున్ జని రిచ్చన్.

క॥ మంగళహారతి కూర్మిన్ జై
లంగాడు వెన్ననకు బత్తులకుముంగొంగుం
బంగారమైనవానికి
సింగారపుగనికి సత్య చిరునవ్వులకున్.

ఆశ్వాసాంతము.

క॥ అచ్చతెలుంగున్నుడి విరు
లిచ్చమెయింగూర్చి సోగు నేర్పరచితి నీ
కిచ్చితి గైకొనుమీ నా
యొచ్చెములెంచేని యున్న నోర్చెడిమిన్నా.

క॥ తెనుగున జేసితకబ్బము
వినుపనగలటంచు నందు రీసున నిది యా
యినుమైన మేల్మిగ్రైయనను
చెనుబత్తి నొసంగినాడ బెట్టుము గంటి.

క॥ పదునాసివి సీ వంకల నలు
నవినవే దననోట శనిబట్టి రిచి శకమి
య్యధిశాలివాహనుని కిం
పులిపృన్ గొనుము కొర్తిప్రహాలతిది కృష్ణా.

క॥ గొనముల కిమ్మగు జంగా
హనుమయగాపించి నట్టి యచ్చతెలుగునన్
గొనబారు సత్యపెండ్లిన్
వనరెడి తుదిగుర్తిక్కయిడియనన్ జెలువారున్.

శ్రీకృష్ణార్పణమస్తు

